# రుద్ర నమకము - చమకము - భావము

# మీకు తెలుసా?

**సేకరణ మరియు సంకలనం : ప్రసాద్ భరద్వాజ 🙏**



**🌹. రుద్రం విశిష్ఠత 🌹**

**శత రుద్రీయం యజుర్వేదంలో భాగం. ఇది మరణాన్ని సహితం అధిగమించగల్గిన సాధనం. జన్మకు మృత్యువుకు అతీతంగా ఉండే తత్వాన్ని సూచిస్తుంది. మనిషిలో శ్వాస నింపేది మరల దానిని తీసుకుపోయేది కూడా ఆ పరమాత్మేనని తెలియజేస్తుంది.**

రుద్రాన్ని రుద్రప్రశ్న అని కూడా అంటారు. ఇది వేద మంత్రాలలో ఎంతో ఉత్కృష్టమైనది. రుద్రం రెండు భాగాలలో ఉంటుంది. "నమో" పదం వచ్చేది మొదటి భాగం. దీనిని నమకం అంటారు. రెండవ భాగంలో "చమే" అన్న పదం మరల మరల రావటం వలన దీనిని చమకం అంటారు.

నమకం చమకం చైవ పురుష సూక్తం తథైవ చ |

నిత్యం త్రయం ప్రాయునజనో బ్రహ్మలోకే మహియతే ||

నమకం చమకం ఎవరైతే మూడు మార్లు పురుష సూక్తంతో ప్రతి దినం ఎవరు చదువుతారో వాళ్లకు బ్రహ్మలోకం  ప్రాప్తిస్తుంది.

--------------------------------------

🌹 నమకం విశిష్టత : 🌹

నమక, చమకాలలో 11 భాగాలు ఉంటాయి. ఒకొక్క భాగాన్ని "అనువాకం" అంటారు. మొదటి అనువాకంలో పరమశివుడిని తన

రౌద్ర రూపాన్ని చలించి, తన అనుచరులను, ఆయుధాలను త్యజించమని ప్రసన్నము చేసుకుంటూ ప్రార్థించేది. శాంతించిన స్వామిని దయతల్చమని ప్రార్థించు భావం ఉంది. ఈ పంక్తులలో ఎన్నో నిగూఢమైన రహస్యాలు దాగి ఉన్నాయి. కొన్ని ఆయుర్వేద మందులు తయారుచేయు విధానాలు కూడా కనిపిస్తాయి.

🌻 **అనువాకం** – 1:

తమ పాపాలను పోగొట్టి, ఆధిపత్యాన్ని, దైవం యొక్క ఆశీర్వచనం పొందేట్టుగా, చేసి, క్షామం, భయం పోవునట్టు చేసి, ఆహార, గోసంపద సమృద్ధి గావించి, గోసంపదను చావునుండి, ఇతర జంతువులనుండి, జబ్బులనుండి కాపాడుతుంది. జ్వర బాధ, జబ్బులు, పిండ-మరణాలు, చెడు కర్మ, నక్షత్ర చెడు ప్రభావాలను తప్పించి, కోర్కెలు తీర్చి, సకాలంలో వానలు కురిపించి, కుటుంబాన్ని పరిరక్షించి, సంతానాన్ని ఆశీర్వదించి, ఐహిక సుఖాలను ప్రసాదించి, శత్రువులను నాశనం చేస్తుంది.

🌻 **అనువాకం** – 2 :

ప్రకృతిలో, సర్వ ఔషధములలో సర్వాంతర్యామి అయిన రుద్రుడికి సంసార బంధాలను సడలించమని ప్రార్ధన.. శత్రు వినాశనానికి, సంపద మరియు రాజ్యప్రాప్తికి, జ్ఞాన సాధనకు ఈ అనువాకాన్ని చదువుతారు.

🌻 **అనువాకం** – 3:

ఈ అనువాకంలో రుద్రుడిని ఒక చోరునిగా వర్ణిస్తుంది. అతడు సర్వాత్మ. ఈ విషయంలో మనిషి ఆ మహాస్వరూపాన్ని అర్ధం చేసుకోక నిమిత్త బుద్ధిని అలవార్చుకున్నాము, ఈ అజ్ఞానాన్ని చౌర్యం చేసి జ్ఞానం అనే వెలుగును మనలో ప్రతిష్టించుతాడు. ఈ అనువాకం వ్యాధి నివారణకు కూడా చదువుతారు.

🌻 **అనువాకం** – 4:

ఇందులో రుద్రుడు సృష్టి కర్త. కారకుడు. చిన్న పెద్దా ప్రతీది అతడు చేసిన సృష్టే, ఈ అనువాకాన్ని క్షయ, మధుమేహం, కుష్టు వ్యాధి నివారణకై చదువుతారు.:

🌻 **అనువాకం** – 5:

ఈ అనువాకంలో రుద్రుడు పారు నీట ఉండే రూపంగా కొనియాడబడుతాడు. అతడి పంచ తత్వాలు వర్ణించబడతాయి అనగా – సృష్టి జరపడం, పరిరక్షించడం, నశించడం, అజ్ఞానంలో బంధింప బడడం మరియు మోక్షప్రదానం.

🌻 అనువాకం – 6:

ఇందులో రుద్రుడు కాలరూపుడు. అతడు అన్ని లోకాల కారణం, వేద రూపం మరియు వేదాంత సారం.

ఐదు ఆరు అనువాకాలు ఆస్తులు పెంపుకు, శత్రువులమీద విజయానికి, రుద్రుని వంటి పుత్రుడిని కోరుకుంటూ, గర్భస్రావం నివారించడానికి, సుఖ ప్రసవానికి , జ్యోతిష పరమైన ఇబ్బందులను నివారించడానికి, పుత్రుల పరిరక్షణకు కూడా చదువుతారు.

🌻 అనువాకం – 7:

నీటిలో, వానలో, మేఘాలలో, ఇలా అన్ని రూపాలలో ఉన్న రుద్రుని వర్ణిస్తుంది. ఈ అనువాకాన్ని తెలివితేటలకు, ఆరోగ్యానికి, ఆస్తిని ,

వారసులను పొందడానికి పశుసంపద, వస్త్రాలు, భూములు, ఆయుష్షు, మొక్షంకోసం కూడా చదువుతారు.

🌻 అనువాకం – 8:

ఇందులో శివుడు ఇతర దేవతలా కారకుడుగాను, వారికీ శక్తి ప్రదాతగాను వర్ణింపబడ్డాడు. యితడు అన్ని పుణ్య నదులలో ఉన్నవాడు, అన్ని పాపాలను పోగొట్టేవాడు. శత్రువులను నాశము చేసి, సామ్రాజ్యాన్ని సాధించడానికి ఈ అనువాకాన్ని చదువుతారు.

🌻 అనువాకం –9:

ఈ అనువకంలో రుద్రుని శక్తి, ప్రకాశం సకల దేవతలకు శక్తిని ఇచ్చేవిగా ప్రస్తుతించబడ్డాయి. సృష్టిలో సర్వ శక్తులను శాసించే శివ శక్తిని మించి ఇంకొకటి లేదు. ఈ అనువాకాన్ని బంగారముకోసం, మంచి సహచారి కోసం, ఉద్యోగం, ఈశ్వర భక్తుడైన పుత్రుని కోసం చేస్తారు.

🌻 అనువాకం – 10:

ఈ అనువాకంలో మరలా రుద్రుడిని తన ఘోర రూపాన్ని ఉపశమించి, పినాకధారియైన, అమ్ములను విడిచిపెట్టి, వ్యాఘ్ర జీనాంబరధారియై ప్రసన్నవదనంతో, దర్శనమివ్వ వలసిందిగా ప్రార్ధన ఉంటుంది. ఈ అనువాకాన్ని ఐశ్వర్యం కోసం , వ్యాధినివృత్తికై, శక్తిమంతులతో వైరం పోగొట్టుటకు, భైరవ దర్శనార్ధమై, అన్నిరకముల భయములను పోగొట్టుటకు, అన్ని పాపాలను పోగొట్టుటకు చదువుతారు.

🌻 అనువాకం – 11:

ఈ అనువాకంలో రుద్రుని గొప్పతనాన్ని ప్రస్తుతించి, అతని కరుణా ప్రాప్తికై నిర్బంధమైన నమస్సులు అర్పించబడుతాయి. ఈ అనువాకాన్ని  తమ సంతాన సౌఖ్యం కోసం, ఆయురారోగ్యవృద్ధి కోసం, పుణ్య తీర్థ దర్శన ఆకాంక్షతో, పూర్వ, ప్రస్తుత, వచ్చేకాలం యొక్క జ్ఞానానికి చదువుతారు.

🌹 చమకం విశిష్టత: 🌹

నమకం చదివిన తర్వాత, భక్తుడు తనే శివ రూపంగా భావించి దేవదేవుడిని  తనకు సర్వం ప్రసాదించమని ప్రార్ధన చేసేది చమకం. ఇది ప్రతీ ఒక్కరికి పనికి వచ్చేది.

జ్ఞానం నుండి మోక్షం కలిగే మార్గములో ప్రతీ పనిని మనిషి ఆస్వాదించి, చివరకు అంతులేని  ఆనందం కలగచేసే మంత్రం. సృష్టి కర్తకు ఒక ప్రాణి నుండి ఇంకో ప్రాణికి విభేదం లేదు. సమస్తం అతనినుంది ఉద్భవించినది కనుక, మోక్ష కాంక్ష దైవత్వమునకు సూచనే..

🥀 🥀 🥀 🥀 🥀

🙏. ప్రసాద్ భరద్వాజ

---

🥀 రుద్రం - చమకం విశిష్టత 🥀

ఇంతకు ముందు రుద్రం - నమకము చమకములలో, నమకం విశిష్టత తెలుసుకున్నాము. ఇప్పుడు చమకం విశిష్టత గురించి తెలుసుకుందాం.

నమకం చదివిన తర్వాత, భక్తుడు తనే శివ రూపంగా భావించి దేవదేవుడిని తనకు సర్వం ప్రసాదించమని ప్రార్థన చేసేది చమకం.

ఇది ప్రతీ ఒక్కరికి పనికి వచ్చేది. జ్ఞానం నుండి మోక్షం కలిగే మార్గములో ప్రతీ పనిని మనిషి ఆస్వాదించి, చివరకు అంతులేని ఆనందం కలగచేసే మంత్రం. సృష్టి కర్తకు ఒక ప్రాణి నుండి ఇంకో ప్రాణికి విభేదం లేడు. సమస్తం అతనినుంది ఉద్భవించినది కనుక, మోక్ష కాంక్ష దైవత్వమునకు సూచనే.

🌻 **అనువాకం** – 1:

మొదటి అనువాకంలో మనిషి నవ నాడులూ జీవత్వంతో ఉట్టిపడి, జ్ఞానేంద్రియాలు స్పష్టంగా ఉండి, ఆరోగ్యముతో జీవితం కలగడానికి చేసే ప్రార్థన.

🌻 **అనువాకం** – 2:

రెండవ అనువాకం నాయకత్వం, ఉచ్ఛ స్థానం, సామాజిక బుద్ధి, తెలివితేటలూ, ఎటువంటి పరిస్థితులనైనా ఎదుర్కొనే ఆత్మ స్థైర్యం, ప్రాపంచిక సుఖాలు, ఖ్యాతి, మరియు భగవత్ జ్ఞానం కలగచేసేది.

🌻 **అనువాకం** – 3:

మూడవ అనువాకంలో భగవంతునికి ఆ జ్ఞానానికి ఉన్న తృష్ణ, పెంపు చేసి, అలౌకికమైన ఆనందాన్ని కలిగించి, ఈ ప్రపంచములో తన స్తితినుంది ఇంకా ఉచ్ఛ స్థితి అయిన భాగావద్సంనిదానాన్ని కాంక్షించేతట్టు చేస్తుంది.

🌻 **అనువాకం** – 4:

నాల్గవ అనువక పఠనం ఈ జీవితంలో ఈ శరీరానికి మంచి ఆహారం, ఆరోగ్యం, గౌరవం, సౌఖ్యం కలిగేటట్టు చేస్తుంది.

🌻 **అనువాకం** – 5:

ఐదవ అనువాకంలో నవరత్నాలని, సర్వ జీవరాశులను తన నిత్య క్రతువులకు సహాయంగా ఉండవలసిందిగా కోరుతుంది.

🌻 **అనువాకం** – 6:

**ఆరవ అనువాకంలో హవిస్సు భాగం స్వీకరించడంలో ఇతర దేవతలలో ఇంద్రుని ప్రాముఖ్యత మరియు ఆధిపత్యం గురించి చెప్పబడింది.**

🌻 **అనువాకం** – 7/8:

**ఏడు, ఎనిమిది అనువాకములలో స్వహాకారంతో హోమ కుండంలో సమర్పించవలసిన వివిధ సమిధుల గురించి వివరింపబడింది.**

🌻 **అనువాకం** –9:

**తొమ్మిదవ అనువాకం నాలుగు వేదాల సారమైన ముఖ్యమైన ప్రార్థన**

🌻 అనువాకం – 10:

పదవ అనువాకంలో జీవుడు తన నిత్య జీవనంలో ఐశ్వర్య సంపాదనలో, క్రతువులలో సహకరించ మని సర్వ జీవరాశులను కోరుతాడు. ఇది ఒక జ్ఞాన యజ్ఞం.

🌻 అనువాకం – 11:

పదకొండవ అనువాకంలో మానవ సరిసంఖ్యకానికి దైవ బేసి సంఖ్యకానికి అనుబంధం కుదరడానికి కావలసిన శక్తిని దీవేనని కోరుకునే ప్రార్ధన.

🌻 చమకం ఐహిక సుఖానేషణ నుండి మొదలయి మొక్షాన్వేషణకు దారిచూపిస్తుంది. దైవం ఆద్యంతమైనది. అదే భూమి, ఆకాశం, కాలం, పునః మరణం, పునః జననం అన్నింటికీ కారణం, అంతం అని చెప్తుంది..

🌹 🌹 🌹 🌹 🌹

🙏. ప్రసాద్ భరద్వాజ

## రుద్ర నమకము - చమకము - భావము

## మీకు తెలుసా?



మనము నిత్యమూ ఆ పరమ శివుని దివ్య మంగళ లింగ రూపమునకు అభిషేకాదులు భక్తితో నిర్వహిస్తూ ఉంటాము. నమక చమకములతో, ఉదాత్తానుదాత్త స్వరితాలతో భక్తి పారవశ్యంతో కొలుస్తూ ఉంటాము. ఐతే మనం చేసే అభిషేకంలో చెప్పే మంత్రార్థం మాత్రం తెలియకుండా అభిషేకము చేయడంకంటే ఆ మంత్రార్థము తెలిసి అభిషేకము చేసినట్లైతే ఒక్క శాతం ఫలము పొందే స్థానంలో వంద శాతం ఫలాన్ని పొందగలం.

### యదధీత మవిజ్ఞాతం నిగదేనైవ శబ్ద్యతే

### అనాగ్నావివ శుష్కేంధౌ నతజ్జ్వలతి కర్హిచిత్.

తాత్పర్యము:- చదివిన దానికి తప్పక అర్థము తెలుసుకొన వలయును. జప మంత్రములకు జప కాలములో  అర్థభావన చేయవలయును. అర్థము తెలియని అక్షర జపము వలన అగ్ని లేని ఎండు కట్టెలు వలె అది జ్వలించదు. అనే ఆర్యుల అభిప్రాయంలో ఎంతో ఔచిత్యం ఉంది. ఐతే, మంత్రములో అక్షర దోషములు అనేకం ఉండే అవకాశము లేకపోలేదు. అలాంటి దోషాలు

ఉన్నట్లయితే, వాటిని మీరు గుర్తించినట్లయితే మా దృష్టికి తీసుకొని రావడంతో పాటు దోష రహితంగా ఉండే అక్షర సూచన కూడా చేయ వలసిందిగా మీకు మనవి.

# రుద్రము - నమకము

## అనువాకము 1.

1వ మంత్రము.

**నమస్తే రుద్రమన్యవ ఉతోత ఇషవే నమః.**

**నమస్తే అస్తు ధన్వనే బాహుభ్యాముత తేనమః.**

ఓ రుద్రుఁడా! నీ కోపమునకు నమస్కారము. నీ కోపము నా బాహ్యాంతశ్శత్రువులపైన ప్రవర్తించును గాక. (నన్ను బాహ్యాంతశ్శత్రుహీనునిగా చేయుదువు గాక అని భావము) అంతే కాదు. నీ బాణమునకు, ధనుస్సునకు ధనుర్బాణ సహితములైన నీ బాహువులకు ఇదే నా నమస్కారము.

## 2వ మంత్రము.

**యాత ఇషుశ్శివతమా శివం బభూవ తే ధనుః.**

**శివాశరవ్యా యాతవతయానో రుద్ర మృడయ.**

ఓ రుద్రుఁడా! నీ యీ శరము చాలా శాంతమైనదాయెను. నీ ధనుస్సు శాంతమైనదాయెను. నీ యమ్ములపొది శాంతమైనదాయెను. కావున శాంతించిన శరీరము తోడను, అమ్ములపొది తోడను మమ్ములను సుఖపరచుము.

## 3వ మంత్రము.

### యాతే రుద్ర శివా తనూర ఘోరాపాపకాశినీ.

### తయాన స్తనువా శంతమయా గిరిశంతాభిచా కశీహి.

ఓ రుద్రుఁడా! మమ్ములను అనుగ్రహించు నీ శివ యను శరీరము మా పట్ల అఘోరమై యుండును గాక. ఆ నీశరీరము మా పట్ల హింసారూపమైన అనిష్టమును ప్రకాశింప జేయకుండును గాక.(ఇట పాపమనగా హింసా రూపమగు అనిష్టము) ఓ పరమ శివా నీ శరీరము మమ్ములను స్వయముగా హింసింప కుండుటయే కాదు. పరుల వలన యే అనిష్టము కలుగ నీయక కాపాడ వలయును. మమ్ములనెవరును హింసింపకుండ కాపాడవలెను. మాకేపాపములు అంటనీయక కాపాడవలెను. మాలోనేవేని పాపములు, లోపములు ఉన్నచో తొలగింపుము. వానిని బహిర్గతములు కానీయకుము, అని మేము నిన్ను ప్రార్థించు చున్నాము.

## 4వ మంత్రము.

### యామిషుం గిరిశంతహస్తే బిభర్ష్యస్తవే

### శివాం గిరిత్ర తాం కురు మాహిగ్ ంసీః పురుషం జగత్.

ఓ గిరిశంత! రుద్ర! వైరులపై చిమ్ముటకు నీవు చేత బాణములను దాల్చితివి. కైలాస గిరిని పాలించు ఓ రుద్రుఁడా! శత్రువులను శిక్షించుటకు చేత దాల్చిన నీ యా బాణమును మాపై చిమ్మక, దానిని శాంతము కలదిగ నుంచుము. పురుషులమగు మమ్ములను, మనుష్య వ్యతిరిక్తమై స్థావర జంగమములతో నిండిన యే జగత్తును హింసింపకుము తండ్రీ! అని ప్రార్థించెను.

## 5వ మంత్రము.

**శివేనవచసాత్వా గిరిశాచ్ఛావదామసి.**

**యధానస్సర్వమి జ్జగదయక్ష్మగ్ ంసుమనా అసత్.**

మహా శివా! నీవు కైలాసమున నివసించు చున్నావు. నిన్ను జేరుటకు మంగళకరమైన స్తుతు లొనర్చుచు ప్రార్థించుచున్నాను. మాదగు ఈ సర్వ జగత్తు మనుష్య పశ్వాది జంగమములతో నిండి యున్నది. ఈ జంగమ ప్రపంచము నిరోగమై సౌమనస్య సంపన్నమగులట్లు గావింపుము తండ్రీ!

## 6వ మంత్రము.

**అధ్యవోచ దధివక్తా ప్రథమోదైవ్యోభిషక్.**

**అహీగ్ శ్చ సర్వాన్ జంభయన్ సర్వాశ్చ యాతు ధాన్యః**

మహాదేవా! మాయందరిలో నీతడే యధికుఁడని నిన్నుద్దేశించి చెప్పుటచే నీవే అధివక్తవైతివి. దేవతలలో నీవే ప్రథముఁడవు, ముఖ్యుఁడవు కదా! నీవు దైవ్యుఁడవు(దేవతలనెల్లస్వయముగా పాలింప సమర్థుఁడవు) నిన్ను దలంచి నంతనే సర్వ రోగములును ఉపశమించును. కాన నీవు చికిత్సకుఁడవు. సర్వ సర్పములను, వ్యాఘ్రాదులను, సర్వ రాక్షసులను నశింపజేయువాఁడవు కదా! కావున మమ్ములను కాపాడుము తండ్రీ!

## 7వ మంత్రము.

**అసౌయస్తామ్రో అరుణ ఉత బభ్రుస్సుమంగళః.**
**యేచేమాగ్ం రుద్రా అభితో దిక్షు శ్రితాస్సహస్రశోవైషాగ్**
**ంహేడఈమహే.**

ఏ రుద్రుఁడు ఈ మండలస్థాదిత్య రూపుఁడో అతఁడు ఉదయ కాలమున అత్యంత రక్త వర్ణుఁడాయెను. ఉదయాత్పూర్వము ఇంచుకంత రక్త వర్ణుఁడాయెను. అంతే కాదు ఉదయానంతర కాలమున పింగళ వర్ణుఁడాయెను.ఆయా కాలములందు అతనిలో మిగిలిన వర్ణములు కలవు. అంధకారాదులను నివారించుటచే అత్యంత మంగళ స్వరూపుఁడాయెను. కిరణ రూపులైన ఏ యితర రుద్రులు ఈ భూమిపై నంతటను, తూర్పు మున్నగు దిక్కులందును, వ్యాపించి యున్నారో వారునూ సహస్ర సంఖ్యాకులై కలరు. సూర్య రూపులును, సూర్య రశ్మి రూపులును అగు ఈ రుద్రులకు అందఱకును ఏ క్రోధ సదృశమైన తీక్షణత్వము కలదో దానిని భక్తి నమస్కారాదులతో నివారించు చున్నారము.

## 8వ మంత్రము.

**అసౌయో ఉవసర్పతి నీలగ్రీవో విలోహితః.**
**ఉతైనం గోపా అదృశన్నదృశన్నుదహార్యః.**
**ఉతైనంవిశ్వాభూతాని సదృష్టో మృడయాతినః.**

ఏ రుద్రుఁడు కాల కూటమను విషము దాల్చుటచే నీలగ్రీవము కలిగి యుండెనో, అట్టి ఈతఁడు విశేషమైన రక్త వర్ణము కలవాడై, మండల వర్తియై, ఉదయాస్తమయ సంపాదకుడై ప్రవర్తించుచున్నాఁడు. అంతే కాదు. వేద శాస్త్ర సంస్కార హీను లైన గోపాలురు కూడ ఈ ఆదిత్య

రూపుఁడై మండలమున గల రుద్రుని చూచుచున్నారు. నీరమును గొనివచ్చు వనితలును ఈ రుద్రుని చూచుచున్నారు. అంతే కాదు ఆదిత్య రూపుఁడగు ఈ రుద్రుని గోవులు, బఱ్ఱెలు మున్నగు సకల ప్రాణులును చూచుచున్నవి. వేద శాస్త్రజ్ఞుల చేతను, వేదశాస్త్రములు తెలియని వారిచేతను, పశుపక్ష్యాదుల చేతను చూడ బడువాఁడైన రుద్రుఁడు మమ్ముఁలను సుఖ వంతులనుగా చేయును గాక.

# 9వ మంత్రము.

**నమో అస్తు నీలగ్రీవాయ సహస్రాక్షాయ మీఢుషే**

**అధోయే అస్య సత్వానో ఽహంతేభ్యోకరం నమః.**

తాత్పర్యము.

ఇంద్ర మూర్తి ధారణచే వేయి కన్నులవాఁడైన శివునకు నమస్కార మగును గాక. ఫర్జన్య రూప ధారియై, వృష్టి కర్తయై సుఖమొసగు శివునకు నమస్కారము. అంతే కాదు. ఏవి ఈ రుద్రుని యొక్క భృత్య రూపములైన ప్రాణులు కలవో వానికి నేను నమస్కారము చేయుచున్నాను.

# 10వ మంత్రము.

**ప్రముంచధన్వనస్త్వముభయోరార్త్ని యోర్జ్యాం**

**యాశ్చతే హస్త ఇషవః. పరాతా భగవోవప.**

ఓ భగవంతుఁడా! నీవు పూజా వంతుఁడవు. మహదైశ్వర్య సంపన్నుఁడవు. ఓ రుద్రా! నీవు నీ ధనుస్సున రెండు చివరలకు కట్టిన త్రాటిని విడువుము. విప్పివేయుము. నీ చేతనున్న బాణములను విడిచిపెట్టుము. మాపై విడువకు తండ్రీ!

## 11వ మంత్రము.

**అవతత్యధనుస్త్వగ్ సహస్రాక్ష శతేషుధే.**

**నిశీర్య శల్యానాంముఖా శివోనస్సుమనాభవ.**

ఇంద్ర రూపుఁడవైన ఓ రుద్రుఁడా! వందల కొలదీ అమ్ములపొదులు కలవాఁడా! ధనుస్సును దించి, బాణముల యొక్క ముఖములను అంప పొదులలో నుంచి, మా పట్ల అనుగ్రహ యుక్తుఁడవై శాంతుఁడవు కమ్ము.

## 12వ మంత్రము.

**విజ్యంధనుఃకపర్దినో విశల్యోబాణవాగ్ ం ఉత**

**అనేశన్నస్యేషవ ఆభురస్య నిషంగధిః.**

జటాజూటము గల శివుని యొక్క ధనుస్సు విగతమైన వింటి త్రాడు కలది యగు గాక. అంతే కాదు. నీ యొక్క బాణములు గల అంప పొది బాణములు లేనిది అగు గాక. ఈ రుద్రుని యొక్క బాణములు అంప పొదిలో నుండుటచే చంపుట కసమర్ధములు అగుగాక. ఈ రుద్రుని యొక్క అంప పొది బాణ వహన మనెడి చిన్న పని చేయుటకు మాత్రమే సమర్ధము అగు గాక. కత్తులు దాచు ఒర కత్తులు మోయుటకు మాత్రమే సమర్ధమగు గాక.

## 13వ మంత్రము.

**యాతే హేతిర్మీఢుష్టమ హస్తే బభూవతే ధనుః**
**తయాస్మాన్ విశ్వతస్త్వమ యక్ష్మయా పరిబ్భుజ.**

అందరి కోరికలను అధికముగా తీర్చే ఓ శివుఁడా! ఏ నీ ఆయుధము ఖడ్గాది రూపమున కలదో, నీ యొక్క చేతియందు ఏ ధనుస్సు కలదో, నీవు ఉపద్రవములు కావింపని ఆ ఆయుధముచే, ఆ ధనుస్సుచే, మమ్ములను అంతటను అన్ని విధములా పరిపాలింపుము.

## 14వ మంత్రము.

**నమస్తే అస్త్వాయుధా యా ఉనాతతా యధృష్ణవే**
**ఉభాభ్యాముతతేనమో బాహుభ్యాం తవ ధన్వనే.**

ఓ రుద్రుఁడా! ధనుస్సున బంధింప బడని కారణమున ప్రసరింపఁ జేయఁ బడినట్టియు, స్వరూపము చేతనే చంప సమర్థమైనట్టి నీ యొక్క ఆయుధమునకు నమస్కార మగు గాక. అంతే కాదు నీయొక్క రెండు భుజములకు నమస్కారము అగు గాక. నీ యొక్క ధనుస్సునకు నమస్కార మగు గాక.

## 15వ మంత్రము.

**పరితే ధన్వనో హేతిరస్మాన్ వృణక్తు విశ్వతః.**
**అధోయ ఇషుధిస్తవా ఉ ఉ రే అస్మన్నిధేహితం.**

ఓ శివుఁడా! నీధనుస్సునకు బాణాది రూపమైన ఆయుధము మమ్ములను అన్ని విధముల విడుచును గాక. అంతే కాదు. నీ యొక్క ఏ అంప పొది కలదో దానిని మా కంటె దూరముగా ఉంచుము.

## అనువాకము 1 సమాప్తము.

నమస్తే అస్తు భగవన్ విశ్వేశ్వరాయ మహా దేవాయ త్ర్యంబకాయ త్రిపురాంతకాయ కాలాగ్ని రుద్రాయ నీల కంఠాయ మృత్యుంజయాయ సర్వేశ్వరాయ సదా శివాయశ్రీమన్మహా దేవాయ నమః.
భగవంతుఁడైన విశ్వేశ్వరునకు, మహా దేవునకు, త్ర్యంబకునకు, త్రిపురాంతకునకు, కాలాగ్ని యైన రుద్రునకు, నీల కంఠునకు, మృత్యుంజయునకు, సర్వేశ్వరునకు, సదా శివునకు, శ్రీమన్మహాదేవునకు నమస్కారము.

## అనువాకము 2.

యజుస్సు 1. (13పదములు కల వచనరూప మంత్రమునే యజుస్సు అంటారు)

**నమో హిరణ్య బాహవే సేనాన్యేదిశాంచపతయే నమః.**

బంగారు నగలు గల బాహువు లందుఁ గల యట్టియు, యుద్ధ రంగమున సేనను జేర్చు సేనానాయకుడగునట్టియు, దిక్కులను పాలించునట్టి వాడును రుద్రునకు నమస్కారము.

## యజుస్సు 2.

**నమో వృక్షేభ్యో హరి కేశేభ్యః పశూనాంపతయేనమః.**

హరిత వర్ణమైన కేశములు పర్ణ రూపమునఁ గల వృక్షాకార రుద్ర మూర్తులకు నమస్కారము అగు గాక. పశువులకు పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగును గాక.

# యజుస్సు 3.

**నమస్సస్పింజరాయత్విషీమతే పథీనాంపతయేనమః.**

సస్ప(లేత గడ్డి)వలె పసుపు, ఎఱుపు, రంగుల కలయిక గల మహా దేవునకు నమస్కార మగు గాక. కాంతి గల రుద్రునకు నమస్కార మగును గాక. శాస్త్రము లందు చెప్ప బడిన దక్షిణోత్తర తృతీయ మార్గములకు పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగు గాక.

# యజుస్సు 4.

**నమో బభ్లుశాయ  వివ్యాధినే ౨  న్నానాంపతయేనమః.**

వాహనమైన ఎద్దుపై కూర్చుండు నట్టియు, శత్రువులను విశేషముగ పీడించు శివునకు నమస్కార మగును గాక. అన్నములైన ఓషధులను పాలించు ప్రభువగు రుద్రునకు నమస్కారము.

# యజుస్సు 5.

**నమో హరికేశాయోపవీతినే పుష్టానాంపతయేనమః.**

నల్లని జుత్తు గల, మంగళ ప్రయోజనమైన యజ్ఞోపవీతము గల రుద్రునకు నమస్కారము. పరిపూర్ణ గుణులైన పురుషులకు స్వామియైన రుద్రునకు నమస్కార మగును గాక.

# యజుస్సు 6.

## నమో భవస్య హేత్యై జగతాంపతయేనమః.

సంసార భేదకుఁడైన రుద్రునకు నమస్కార మగును గాక. లోకములకు పాలకుఁడైన రుద్రునకు నమస్కారమగును గాక.

# యజుస్సు 7.

## నమోరుద్రాయా  ఽఽతతావినేక్షేత్రాణాంపతయేనమః.

విస్తరింప బడిన ధనుస్సులతో రక్షించునట్టి రుద్రునకు నమస్కార మగు గాక. క్షేత్రములకు (శరీరములకు-పుణ్యక్షేత్రములకు) పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగు గాక.

# యజుస్సు  8.

## నమస్సూతాయాఽహంత్యా య వనానాంపతయేనమః.

సారథి యైనట్టియు, శత్రువులను సంహరింప శక్యుఁడైన రుద్రునకు నమస్కార మగు గాక. అరణ్యములకు పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగు గాక.

## యజుస్సు 9.

### నమోరోహితాయస్థపతయేవృక్షాణాం పతయే నమః.

లోహిత వర్ణుఁ డైనట్టియు, ప్రభు వైనట్టి రుద్రునకు నమస్కారము. చెట్లకు పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగుఁ గాక.

## యజుస్సు 10.

### నమో మంత్రిణే వాణిజాయకక్షాణాంపతయేనమః.

రాజ సభలో మంత్రాలోచన కుశలుఁ డైనట్టియు, మంత్రి రూపమున వణిజులకు స్వామి యైనట్టి రుద్రునకు నమస్కారము. వనము లందలి గుల్మ లతాదులకు పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగుఁ గాక.

## యజుస్సు 11.

### నమో భువంతయే వారివస్కృతా,యౌషధీనాం పతయే నమః.

భూమిని విస్తరింప జేయు రుద్రునకు నమస్కార మగుఁ గాక. ధనము చేకూర్చునట్టి (సేవచేయుభక్తులకుచెందినట్టి) రుద్రునకు నమస్కార మగుఁ గాక. ఓషధులకు ప్రభువగు రుద్రునకు నమస్కార మగు గాక.

## యజుస్సు 12.

### నమ ఉచ్చైర్ఘోషాయా క్రందయతే పత్తీనాంపతయేనమః.

యుద్ధ సమయమున మహోన్నత ధ్వనిగా కల శివునకు నమస్కారము. శత్రువుల నేడిపించు శివునకు నమస్కార మగు గాక. పాదచారులైన యోధులకు పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగు గాక.

## యజుస్సు 13.

### నమః కృత్స్న వీతాయధావతే సత్వనాంపతయేనమః.

చుట్టునూ ఆవరింపబడిన సకల సైన్యము గల రుద్రునకు నమస్కారము. పరుగులిడుచున్న శత్రుసైన్యముల వెనుకనేగు రుద్రునకు నమస్కారమగుగాక. సాత్వికులై శరణాగతులైనవారి పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగుగాక.

## అనువాకము 2 సమాప్తము.

## అనువాకము 3.

## యజుస్సు 1.

### నమస్సహమానాయనివ్యాధిన అవ్యాధినీనాం పతయే నమః.

విరోధులను అభిభవించు (పరాభవించు) రుద్రునకు నమస్కారము
మిక్కిలి విరోధులను బాధించు రుద్రునకు నమస్కారము. అంతటను సంపూర్ణముగా బాధించు శూర సేనలకు పాలకుఁడైన రుద్రునకు నమస్కార మగు గాక.

# యజుస్సు 2.

## నమః కకుభాయ నిషంగిణే స్తేనానాంపతయేనమః.

కకుభ (అర్జునవృక్షము వలె ప్రధానుఁడైనట్టి) సదృశమైన, ఖడ్గము చేతఁ గల శివునకు నమస్కారము. గుప్త చోరులకు పాలకుఁడైన శివునకు నమస్కారము.

# యజుస్సు 3.

## నమోనిషంగిణ ఇషుధిమతే తస్కరాణాంపతయే నమః.

ధనుస్సును సంధించుటకు చేత బాణము కలిగినట్టియు, పృష్ఠ భాగమున కట్టఁ బడిన అమ్ముల పొది కలిగినట్టి శివునకు నమస్కారము. ప్రకట చోరులకు పాలకుఁడైన శివునకు నమస్కారము.

# యజుస్సు 4.

## నమో వంచతే పరి వంచతే స్తాయూనాంపతయే నమః.

యజమానికి ఆప్తుడై అతని క్రయ విక్రయాది వ్యవహారము లందు మెలగుచు, ఎచ్చట నైనను, ఏమాత్ర మైనను అతని ద్రవ్యమును అపహరించుట యనెడి వంచన మొనరించు వాని స్వరూపముతో నుండు శివునకు నమస్కారము. పైన చెప్పినట్లు యజమానిని బాగుగా మోసగించు శివునకు నమస్కారము. రాత్రి యందు పగటి యందు అన్యులకు తెలియనీయక యజమాని సొత్తు నపహరించు వారికి పాలకుడైన శివునకు నమస్కారము.

## యజుస్సు 5.

### నమోనిచేరవే పరిచరాయారణ్యానాంపతయేనమః.

నిరంతరము సంచార శీలము కలవాడు, బాగుగా సంచరించునట్టి శివునకు నమస్కారము. నిరంతరము అరణ్యమునందుండు వారి ప్రభువైనట్టి శివునకు నమస్కారము.

## యజుస్సు 6.

### నమస్సృకావిభ్యో జిఘాగ్ ం సద్భ్యో ముష్ణతాంపతయేనమః.

వజ్రమును బోలిన స్వశరీరమును రక్షించువారు సృకావినులు. వజ్రము వంటి తమ శరీరము రక్షించు వారికి నమస్కారము. కృషికులై స్వామి ధాన్యము అపహరించు వారికి ప్రభువైన శివునకు నమస్కారము.

## యజుస్సు 7.

### నమో ఉసిమద్భ్యో నక్తంచరద్భ్యః  ప్రకృంతానాంపతయేనమః.

ఖడ్గము కల చోరులకు నమస్కారము. రాత్రి సంచరించువారై వీధులలో పోవు వారిని పీడించు చోరులకు నమస్కారము. కుత్తుకలు కత్తిరించి అపహరించు వారికి ప్రభువగు శివునకు నమస్కారము.

## యజుస్సు 8.

### నమ ఉష్ణీషిణే గిరిచరాయ కులుంచానాం పతయే నమః.

శిరస్సును కాపాడు తలపాగా కలిగినట్టి పర్వతముల సంచరించు నట్టి శివునకు నమస్కారము. భూమిని అపహరించు వారికి ప్రభువగు శివునకు నమస్కారము.

## యజుస్సు 9.

### నమ ఇషుమద్భ్యో ధన్వావిభ్యశ్చవోనమః.

బాణములు కలిగినట్టి మీకు నమస్కారము. ధనుస్సులు కలిగినట్టి మీకు నమస్కారము.

## యజుస్సు 10.

### నమ అతన్వానేభ్యః.ప్రతిదధానేభ్యశ్చవోనమః.

ధనుస్సున త్రాటిని ఆరోపించు మీకు నమస్కారము. ధనుస్సున బాణమును సంధించు మీకు నమస్కారము.

## యజుస్సు 11.

### నమ అయచ్ఛద్భ్యో విసృజద్భ్యశ్చవోనమః.

వింటి త్రాటిని ఆకర్షించునట్టి మీకు నమస్కారము. ధనుస్సు నుండి బాణములను విడుచు నట్టి మీకు నమస్కారము.

## యజుస్సు 12.

### నమో ఉస్యద్భ్యో విధ్యద్భ్యశ్చవోనమః.

లక్ష్యము వరకు బాణము విడుచునట్టియు, లక్ష్యము నందు బాణము ప్రవేశ పెట్టు మీకు నమస్కారము.

## యజుస్సు 13.

### నమ ఆసీనేభ్యశ్శయానేభ్యశ్చవోనమః.

కూర్చుండునట్టియును, నిద్రించునట్టి మీకు నమస్కారము.

## యజుస్సు 14.

### నమస్స్వపద్భ్యో జాగ్రద్భ్యశ్చవోనమః.

నిద్రించునట్టి మీకు నమస్కారము. మేల్కొని యుండునట్టి మీకు నమస్కారము.

## యజుస్సు 15.

**నమస్తిష్ఠద్భ్యో ధావద్భ్యశ్చవోనమః.**

**నిశ్చలముగా నుండునట్టి మీకు నమస్కారము. పరుగెత్తునట్టి మీకు నమస్కారము.**

## యజుస్సు 16.

**నమస్సభాభ్యస్సభాపతిభ్యశ్చవోనమః.**

**సంఘముగా నున్న వారికి నమస్కారము. సంఘముగా నున్నవారికి ప్రభు వగు మీకు నమస్కారము.**

## యజుస్సు 17.

**నమో అశ్వేభ్యో ౨ శ్వపతిభ్యశ్చవోనమః.**

**అశ్వ విగ్రహులకు నమస్కారము. తనదగు ధనము లేని వానికి నమస్కారము. ఎవరి నుండియు ఏమియును గ్రహింపకుండుటచే రేపటికవసరమగు ధనము లేనివారికి నమస్కారము. అశ్వాధ్యక్షులును మహాశ్రీ గల వారును అగు మీకు నమస్కారము.**

## అనువాకము 3 సమాప్తము.

## అనువాకము 4.

# యజుస్సు 1.

## నమ అవ్యాధినీభ్యో వివిధ్యంతీభ్యశ్చవోనమః.

సంపూర్ణముగా వేధించుటకు సమర్థులైన స్త్రీలకు నమస్కారము. విశేషముగా పీడించుటకు సమర్థులైన స్త్రీలగు మీకు నమస్కారము.

# యజుస్సు 2.

## నమ ఉగణాభ్యస్తృగ్ హతీభ్యశ్చవోనమః.

ఉత్కృష్ట గుణ రూపలైన సమస్త మాతృకలు మున్నగు స్త్రీలకు నమస్కారము. పరులను హింసించుటకు సమర్థులైన దుర్గ మున్నగు భయంకర దేవతలకు నమస్కారము.

# యజుస్సు 3.

## నమో గృత్సేభ్యో గృత్సపతిభ్యశ్చవోనమః.

విషయాసక్తులకు నమస్కారము. విషయాసక్తులను రక్షించు మీకు నమస్కారము.

# యజుస్సు 4.

## నమోవ్రాతేభ్యో వ్రాతపతిభ్యశ్చవోనమః.

నానా జాతుల సంఘములకు నమస్కారము. సంఘాధిపతులైన మీకు నమస్కారము.

## యజుస్సు 5.

### నమో గణేభ్యో గణపతిభ్యశ్చవోనమః.

దేవానుచర గణములకు నమస్కారము. దేవానుచర గణములకు ప్రభువైన మీకు నమస్కారము.

## యజుస్సు 6.

### నమో విరూపేభ్యో విశ్వరూపేభ్యశ్చవోనమః.

వికృత రూపులైన నగ్న ముండాదులకు నమస్కారము. తురంగ గజ వక్త్రాది నానా రూపములను దాల్చు భృత్యులును అగు మీకు నమస్కారము.

## యజుస్సు 7.

### నమో మహద్భ్యః క్షుల్లకేభ్యశ్చవోనమః.

అణిమా ద్యష్టైశ్వర్యములతో కూడుకొన్నవారికి నమస్కరము. అష్టైశ్వర్యములు లేని మీకు నమస్కారము.

## యజుస్సు 8.

### నమో రథిభ్యో ఽరథేభ్యశ్చవోనమః.

శరీర రథము నధిష్ఠించిన పరమాత్మకును, రథులైన యోధులకును, జీవులకును నమస్కారము. రథము లేని సామాన్య జీవులకును, శరీర రథము లేని అప్రాణులున్నగు మీకును నమస్కారము.

## యజుస్సు 9.

### నమోరథేభ్యో రథపతిభ్యశ్చవోనమః.

రథ రూపులకు నమస్కారము. రథములకు ప్రభువులైనట్టి మీకు నమస్కారము.

## యజుస్సు 10.

### నమస్సేనాభ్యస్సేనానిభ్యశ్చవోనమః.

రథ గజ తురగ పదాతి రూప సేనలకు నమస్కారము. సేనా నాయకులైనట్టి మీకు నమస్కారము.

## యజుస్సు 11.

### నమః క్షత్తృభ్యః సంగ్రహీతృభ్యశ్చవోనమః.

రథ శిక్షకులును, రథములను గ్రహించు సారథులును అగు మీకు నమస్కారము.

## యజుస్సు 12.

### నమస్తక్షభ్యోరథకారేభ్యశ్చవోనమః.

దేవాధిష్టానులైన శిల్పి విశేషులకు నమస్కారము. చక్కగా రథములను నిర్మించు శిల్పులగు మీకు నమస్కారము.

## యజుస్సు 13.

**నమః కులాలేభ్యః కర్మారేభ్యశ్చవోనమః.**

కుంభకారులకు నమస్కారము. లోహకారులగు మీకు నమస్కారము.

## యజుస్సు 14.

**నమః పుంజష్టేభ్యో నిషాదేభ్యశ్చవోనమః.**

పక్షి పుంజములను సంహరించు వారికి నమస్కారము. మత్స్య ఘాతుకులైనట్టి మీకు నమస్కారము.

## యజుస్సు 15.

**నమ ఇషుకృద్భ్యో ధన్వకృద్భ్యశ్చవోనమః.**

చక్కని శరీరములను చేయునట్టి మీకు నమస్కారము. చక్కని ధనుస్సులను చేయునట్టి మీకు నమస్కారము.

## యజుస్సు 16.

**నమోమృగయుభ్యశ్శ్వనిభ్యశ్చవోనమః.**

మృగములను చంపెడి వ్యాధులకు నమస్కారము. కుక్కల మెడలయందు గట్టబడిన పాశములను దాల్చెడి మీకు నమస్కారము.

## యజుస్సు 17.

**నమశ్శ్వభ్యశ్శ్వపతిభ్యశ్చవోనమః.**

శ్వాన రూపధారులకు నమస్కారము. శునక స్వాములైన మీకు నమస్కారము.

## అనువాకము 4 సమాప్తము.



అనువాకము 5.

యజుస్సు 1.

నమో భవాయచ రుద్రాయచ.

ప్రాణుల యుత్పత్తికి మూల కారణమైన, జీవుల రోదనమునకు కారణ మైనట్టియు దుఃఖమును ద్రవింప జేయు నట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 2.

నమశ్శర్వాయచ పశుపతయేచ.

పాప నాశకులకును, అజ్ఞానులైన పురుషులను

పాలించు వారికిని నమస్కారము.

యజుస్సు 3.

నమో నీలగ్రీవాయచ శితి కంఠాయచ.

నీలగ్రీవము స్వేత కంఠము కలవాఁడు నగు శివునకు

నమస్కారము.

యజుస్సు 4.

నమః కపర్దినేచ వ్యుప్త కేశాయచ.

జటాజూటము కల వానికి, వ్యుప్త ముండిత కేశునకు

(జుత్తులేనివానుకు) నమస్కారము.

యజుస్సు 5.

నమస్సహస్రాక్షాయచ శతధన్వనేచ.

ఇంద్ర వేషముచే సహస్రాక్షుఁడైన వాఁడును, సహస్ర భుజములు గల అవతారములు ధరించుటచే శతధన్వుఁడును ఐన శివునకు నమస్కారము.

యజుస్సు 6.

నమో గిరిశాయచ శిపివిష్టాయచ.

కైలాసమున ఉండువాఁడును, శయనించువాఁడును, విష్ణువును తన హృదయమున ధరించువాఁడును అగు శివునకు నమస్కారము.

యజుస్సు 7.

నమో మీఢుష్టమాయచేషుమతేచ.

మేఘ రూపమున మిక్కిలి వర్షము
కురిపించువాఁడును, బాణములు కలవాఁడును అగు
శివునకు నమస్కారము.

యజుస్సు 8.
నమో హ్రస్వాయచ వామనాయచ.
(అల్ప ప్రమాణుడగుటచే) హ్రస్వముగా
నున్నట్టియును, (వ్రేళ్ళు మున్నగు అవయవముల
సంకోచమువలన) వామనుఁడుగా నున్నట్టి
శివునకు నమస్కారము.

యజుస్సు 9.
నమోబృహతేచవర్షీయసేచ.
ఆకారముచే ప్రౌఢుఁడైనట్టియు, గుణములచే
సమృద్ధుఁ డైనట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 10.

నమోవృద్ధాయచ సంవృధ్ధ్వనేచ.

వయసుచే అధికుఁడైనట్టియు, శృతులచే బాగుగా వృద్ధి బొందునట్టివాఁడు నగు శివునకు నమస్కారము.

యజుస్సు 11.

నమో అగ్రియాయచ ప్రథమాయచ.

జగదుత్పత్తికి పూర్వమున్నట్టియు, సభలో ముఖ్యుఁడును అగు పరమ శివునకు నమస్కారము.

యజుస్సు 12.

నమ ఆశవే చాజిరాయ చ.

అంతటను వ్యాపించినట్టి గమనకుశలుఁడైన శివునకు నమస్కారము.

యజుస్సు 13.
నమశ్శీఘ్రియాయచ శీభ్యాయచ.
శీఘ్రముగా పోవు వాఁడును, ఉదక ప్రవాహమునను న్నట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 14.
నమఊర్మ్యాయచా వస్వన్యాయచ.
తరంగములతో గూడి యున్నట్టియు, ధ్వని రహితమైన స్థిరమైన జలమున ఉన్నట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 15.

నమస్స్రోతస్యాయచ ద్వీప్యాయచ.

ప్రవాహమున నున్నట్టియు, జల మధ్యస్థములైన ద్వీపములందున్నట్టి శివునకు నమస్కారము.

అనువాకము 5 సమాప్తము.

అనువాకము 6.

యజుస్సు 1.

నమోజ్యేష్ఠాయచ కనిష్ఠాయచ.

విద్య ఐశ్వర్యము మున్నగు వానిచే జ్యేష్ఠుఁడైనట్టి వాఁడున్నూ విద్యాదులతో కనిష్ఠుఁడైన వాడును అగు మహాదేవునకు నమస్కారము.

యజుస్సు 2.

నమః పూర్వజాయచాపరజాయచ.

జగదాదిని హిరణ్య గర్భ రూపమున జన్మించి నట్టి

జగ దవసాన సమయమున అగ్ని రూపమున

జన్మించినట్టి మహాదేవునకు నమస్కారము.

యజుస్సు 3.

నమోమధ్యమాయచాపగల్భాయచ.

మధ్య కాలమున దేవ తిర్య గాది రూపమున

జన్మించి నట్టియును, ప్రరూఢములు కాని

ఇంద్రియములు కలవాడును అగు మహాదేవునకు

నమస్కారము.

యజుస్సు 4.

నమో జఘన్యాయచ బుధ్నియాయచ.

గవాదులపశ్చాత్భాగమున వత్సాది రూపమున

నున్నట్టియును, వృక్షాదుల మూలమున శాఖాదుల

రూపమున నున్నట్టి పరమ శివునకు
నమస్కారము.

యజుస్సు 5.
నమస్సోభ్యాయచ ప్రతిసర్యాయచ.
పుణ్య పాపములతో కూడుకొన్నవాఁడును,
రక్షాబంధమున కర్తమైనట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 6.
నమో యామ్యాయ క్షేమ్యాయచ.
యమలోకమునఁ బాపులను శిక్షించు వాని
రూపమున జన్మించి నట్టియును, మోక్షమున
కర్తుడై యున్నట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 7.

నమ ఉర్వర్యాయచ ఖల్యాయచ.

సర్వ సస్యములతో నిండిన భూమితో ధాన్యాది విశేష రూపమున ఉన్నట్టియు, మేడి, నక్కు నాగలి రూపమున భూమిని దున్ని, అందలి సారమును వెలిబుచ్చునట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 8.

నమశ్శ్లోక్యాయచావసాన్యాయచ.

వేదమంత్రములచే తెలియ దగు మహిమ కలవాఁడై, వానిలోనున్నట్టియును, వేదాంతములైన ఉపనిషత్తులచే నిరూపింప దగు తత్వము కలవాఁడు కాన వానిలో నున్నట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 9.

నమో వన్యాయచ కక్ష్యాయచ.

వృక్షాది రూపమున నున్నట్టియును, లతాది రూపమున నున్నట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 10.

నమశ్శ్రవాయచ ప్రతిశ్రవాయచ.

శబ్ద రూపుఁడును ప్రతి ధ్వని రూపుఁడును అగు శివునకు నమస్కారము.

యజుస్సు 11

నమ అశుషేణాయచాశురథాయచ.

వేగముగా పోవు సేన కలిగినట్టి, వేగముగా పోవు రథము కలిగినట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 12.

నమశ్శూరాయచావభిందతేచ.

యుద్ధమున ధైర్యము కలవాఁడును, శత్రువులను సంహరించువాఁడును అగు శివునకు నమస్కారము.

యజుస్సు 13.
నమో వర్మిణేచ వరూధినేచ.
కవచము కలిగినట్టియు, గృహము కలవాఁడును అగు శివునకు నమస్కారము.

యజుస్సు 14.
నమో బిల్మినేచకవచినేచ.
బిలము ఉపమానముగా కలదియును, యుద్ధమున శిరో రక్షకమునగు కిరీటము కలవాఁడును, శరీర రక్షకమైన కవచము కలవాఁడును అగు శివునకు నమస్కారము.

యజుస్సు 15.

నమశ్శ్రుతాయచ శ్రుత సేనాయచ.

వేద ప్రసిద్ధుఁడైనట్టియు, శత్రు నిగ్రహమందు ప్రసిద్ధమైన సేన కలవాఁడునగు శివునకు నమస్కారము.

అనువాకము 6 సమాప్తము.

అనువాకము 7.

యజుస్సు 1.

నమో దుందుభ్యాయచాహన్యాయచ.

భేరీ నుండి బయల్వెడలిన శబ్దము స్వరూపముగా కలవాఁడును, దుందుభిని మ్రోగించు దండముతో మొత్తుటచే బయల్వెడలిన నాదము రూపముగా

కలవాఁడును, వంశ దండోద్భవుఁడు అగు శివునకు
నమస్కారము.

యజుస్సు 2.
నమోధృష్ణవేచ ప్రమృశాయచ.
యుద్ధమున పలాయన రహితుఁడును, పర సైన్య
వృత్తాంతమును పరామర్శించువాఁడును అగు
శివునకు నమస్కారము.

యజుస్సు 3.
నమో దూతాయచప్రహితాయచ.
స్వామి వృత్తాంతములను స్వస్వామి జనులకు
తెలియ జేయుటలో కుశలుఁ డైనట్టియు, స్వామిచే
పంపఁ బడిన పురుషుఁడైనట్టి శివునకు
నమస్కారము.

యజుస్సు 4.

నమో నిషఙ్గిణేచేషుధిమతేచ.

ఖడ్గము కలవాఁడును బాణాధారమైన అమ్ముల పొది కలవాఁడును అగు శివునకు నమస్కారము.

యజుస్సు 5.

నమస్తీక్ష్ణేషవేచాయుధినేచ.

వాడి బాణములు కలవాఁడును, బహ్వాయుధములు కలవాఁడునగు శివునకు నమస్కారము.

యజుస్సు 6.

నమస్స్వాయుదాయచసుధన్వనేచ.

శోభనమైన త్రిశూల రూపమగు ఆయుధము కలవాఁడును, శోభనమైన పినాక రూపమగు

ధనుస్సు కలవాఁడును అగు శివునకు

నమస్కారము.

యజుస్సు 7.

నమస్స్రుత్యాయచ పథ్యాయచ.

పాద సంచార యోగ్యమైన క్షుద్ర మార్గమునకు

అర్హుఁడును, రథాశ్వాది సంచార యోగ్యమైన

ప్రౌఢమార్గము కలవాఁడును అగు శివునకు

నమస్కారము.

యజుస్సు 8.

నమః కాట్యాయచ నీప్యాయచ.

కుత్సితమైన జలము అనగా అల్ప జలము

ప్రవహించు చోటును కటము అందురు. అందు జల

రూపమున నున్న శివుఁడు కాట్యుఁడు. అతనికి

నమస్కారము. అధో ముఖము గాను, అడ్డము గాను జలము ప్రవహించు చోటను జల రూపమున నున్న శివునకు నమస్కారము.

అనువాకము 7 సమాప్తము.

అనువాకము 8.

యజుస్సు 1.

ఓం నమస్సోమాయచ రుద్రాయచ.

ఉమతో గూడి యున్నట్టియు, సకల జీవుల రోదన హేతువైన దుఃఖమును ద్రవింప జేయు నట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 2.

నమస్తామ్రాయచారుణాయచ.

ఉదయ కాలమున ఆదిత్య రూపుఁడగుటచే అత్యంత

రక్త వర్ణుఁడై ఉన్నట్టియు, ఉదయానంతరమున

ఇంచుకంత రక్త వర్ణుఁడై ఉన్నట్టి శివునకు

నమస్కారము.

యజుస్సు 3.

నమశ్శంగాయచ పశుపతయేచ.

సుఖమును పొందించు వాఁడును, సుఖము

నుత్పాదించు వాఁడును, భయ హేతువులైన పాప

రోగ చోరాదుల నుండి రక్షించు వాఁడును

అగు  మహా దేవునకు నమస్కారము.

యజుస్సు 4.

నమ ఉగ్రాయచ భీమాయచ.

విరోధులను నశింప జేయుటకు క్రోధ యుక్తుఁ డైనట్టి

వాఁడును, దర్శన మాత్రము చేత విరోధులకు భయ హేతు వైనట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 5.

నమో అగ్రేవధాయచ దూరేవధాయచ.

అగ్రమునందు వధ కలవాఁడును

(ముందున్నవానిని సంహరించువాఁడు)

దూరమునందు వధ కలవాఁడును, అగు శివునకు నమస్కారము.

యజుస్సు 6.

నమోహంత్రేచహనీయసేచ.

దూర సమీప వర్తి శత్రువులను ధ్వంసము చేయువాఁడును, శత్రు ధ్వంసము చేయువాఁడును,

సర్వాతిశాయి శక్తిచే సర్వులను సంహరించు వాఁడును అగు శివునకు నమస్కారము.

యజుస్సు 7.

నమో వృక్షేభ్యో హరికేశేభ్యః.

కల్పవృక్షాది స్వరూపుఁడును, హరిత వర్ణములును, కేశ సదృశములునగు ఆకులు గల వృక్షములు స్వరూపముగా కలవాఁడునగు శివునకు నమస్కారము.

యజుస్సు 8.

నమస్తారాయ.

ఓంకార రూపమైన ప్రణవముచే ప్రతిపాదింపఁబడు శివునకు నమస్కారము.

యజుస్సు 9.

నమశ్శంభవేచమయోభవేచ.

సుఖము నుత్పాదించు వాఁడును, లోకములకు సుఖము భావించు వాఁడు నగు శివునకు నమస్కారము.

యజుస్సు 10.

నమశ్శంకరాయచ మయస్కరాయచ.

విషయ సుఖములను జేకూర్చు వాఁడును, మోక్ష సుఖమును జేకూర్చువాఁడును అగు శివునకు నమస్కారము.

యజుస్సు 11.

నమశ్శివాయచ శివతరాయచ.

కల్యాణ స్వరూపుఁడై స్వయముగ నిష్కల్మషముగ నుండు వాఁడును, మిక్కిలి కల్యాణ స్వరూపుఁడుగా నుండునట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 12.

నమస్తీర్థ్యాయచ కూల్యాయచ.

ప్రయాగాది తీర్థములందు సన్నిహితుఁడై యుండునట్టియును, నదీ తీరములందు ప్రతిష్టింపఁబడిన లింగరూపమున నుండునట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 13.

నమ పార్యాయచ వార్యాయచ.

సంసార సముద్రము దాటించి, మోక్ష కాములచే ధ్యానింప దగిన వాఁడును, సంసార మధ్యమున

నున్నవారికి కామ్య ఫలదుండునగు శివునకు నమస్కారము.

యజుస్సు14.

నమః ప్రతరణాయచోత్తరణాయచ.

గొప్ప మంత్ర జపాదుల యొక్క రూపము వలనఁ బాప తరణమునకు హేతువైనట్టియు, తత్వ జ్ఞాన రూపమున సంపూర్ణముగా సంసారము నుండి దాటించు వాఁడునగు శివునకు నమస్కారము.

యజుస్సు 15.

నమ ఆతార్యాయచాలాద్యాయచ.

జీవ రూపమున మరల సంసార గమనమునకు అర్హుఁడైనట్టియు, సంపూర్ణముగా కర్మఫలము ననుభవించు జీవుఁడైనట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 16.

నమశ్శష్ప్యాయచ ఫేన్యాయచ.

గంగా తీరాదులతో జన్మించు కుశాంకురాదులకు అర్హుఁడైనట్టియును, నదీ మధ్య గత ఫేనమునకు అర్హుఁడైనట్టి శివునకు నమస్కారము.

యజుస్సు 17.

నమస్సికత్యాయచ ప్రవాహ్యాయచ.

సికతకు అర్హుఁడైనట్టియును, ప్రవాహమునకు అర్హుఁడైనట్టి శివునకు నమస్కారము.

అనువాకము 8 సంపూర్ణము.

అనువాకము 9.

1) నమ ఇరిణ్యాయచ ప్రపథ్యాయచ.

ఊషర క్షేత్రములం దుండునట్టియును, పది మంది నడుచు త్రోవలోనుండు నట్టి శివునకు నమస్కారము.

2) నమకిగ్ ం శిలాయచక్షయణాయచ.
కుత్సితములు అనగా క్షుద్రములగు శిలలు గల ప్రదేశముల నుండునట్టి, నివాస యోగ్య ప్రదేశమునం దుండునట్టి శివునకు నమస్కారము.

3) నమః కపర్దినేచ పులస్తయేచ.
జటా బంధము కలవాఀడును భక్తుల యెదుట నుండు నట్టి శివునకు నమస్కారము.

4) నమో గోష్ఠ్యాయచ గృహ్యాయచ.

గోశాలలో నుండునట్టియు, సామాన్య గృహములలో నుండునట్టి శివునకు నమస్కారము.

5) నమస్తల్ప్యాయచ గేహ్యాయచ.
తల్పము నందును మంచము పైని శయనించునట్టియును, ధనికుల ప్రాసాదమునం దుండు వాఁడు నగు శివునకు నమస్కారము.

6) నమః కాట్యాయచ గహ్వరేష్ఠాయచ.
కుత్సితముగా తిరుగువాఁడును, ముండ్లతో నిండిన లతాదులచే ప్రవేశింప నలవి కాని ప్రదేశమున నుండువాఁడును, విషయములైన గిరి గుహాదులలో నుండువాఁడునగు శివునకు నమస్కారము.

7) నమోహద్రయ్యాయచ నివేష్ప్యాయచ.

అగాధ జలములం దుండువాఁడును, నీహార జలమం దుండువాఁడునగు శివునకు నమస్కారము.

8) నమః పాగ్ ం సవ్యాయచ రజస్యాయచ.
పరమాణువులం దున్నట్టియును విస్పష్టమైన ధూళిలోనున్నట్టి శివునకు నమస్కారము.

9) నమః శ్శుష్క్యాయచ హరిత్యాయచ.
కాష్ఠములం దున్నట్టియును, తడిసిన దాని యందు క్రొత్త దాని యందున్నట్టి శివునకు నమస్కారము.

10) నమో లోప్యాయచో లప్యాయచ.
తృణాదికము లోపించు కఠిన ప్రదేశమున నున్నట్టియును, రెల్లు మొదలగు తృణములం దున్నట్టి శివునకు నమస్కారము.

11) నమ ఊర్వ్యాయచ సూర్మ్యాయచ.
భూమియందుండువాఁడును, చక్కని కెరటములు
గల నదులయందుండు వాఁడునగు శివునకు
నమస్కారము.

12) నమః పర్ణ్యాయచ పర్ణ్యశద్యాయచ.
ఆకులం దున్నట్టియును, ఎండుటాకుల
మొత్తమునం దున్నట్టి శివునకు నమస్కారము.

13) నమో పగురమాణాయచాభిఘ్నుతేచ.
సిద్ధము చేయబడిన ఆయుధములు కలవాఁడును,
సంపూర్ణముగా సంహరించునట్టి శివునకు
నమస్కారము.

14) నమాక్షితతేజ ప్రక్షితతేజ.

ఇంచుకంత దుఃఖము కలిగించునట్టియు, అత్యంత దుఃఖము కలిగించునట్టి శివునకు నమస్కారము.

15) నమో వఃకిరికేభ్యోదేవానాగ్ ం హృదయేభ్యః.

భక్తులకు ధనమును చిమ్మెడి ఉదారులగు రుద్రావతారులకును, సర్వ దేవ ప్రియుఁ డగుటచే సర్వ దేవతల హృదయమగు వారికి నమస్కారము.

16) నమో విక్షీణకేభ్యః.

క్షీణించు వాని కంటే విపరీతములై ఎపుడునూ నశింపని శివ శక్తులకు నమస్కారము.

17) నమో విచిన్వత్కేభ్యః.

అపేక్షించు అర్థమును సంపాదించి యొసంగు శివునకు నమస్కారము.

18) నమ అనిర్హతేభ్యః.
సంపూర్ణముగా, నిశ్శేషముగా జీవుల యొక్క పాపములను, అచేతనము లందలి దోషములను, లోపములను, తొలగించు శివునకు నమస్కారము.

19) నమ అమీవత్కేభ్యః.
సంపూర్ణముగా స్థూల భావము పొంది దేవతలలో కల శివునకు నమస్కారము.
అనువాకము 9 సమాప్తము.

అనువాకము 10.

ఋక్కు 1.

ద్రాపే అంధసస్పతే దరిద్రం నీల లోహిత
ఏషాం పురుషాణామేషాం పశూనాంమాభేర్మాఽరో
మో ఏషాం కించనామమత్.

కుత్సితమైన గతిని పొందించువాఁడా! అన్నమును రక్షించువాఁడా! ఏమియునూ లేనివాఁడా! కంఠమున నల్లనివాఁడపై ఇతరత్ర ఎఱ్ఱనివాఁడా!  పుత్రపౌత్రాదుల యొక్కయు ఈ మాదగు గో మహిష్యాదుల యొక్కయు, సమూహమును భయపెట్టకుము. ఈ మోక్షమందిన అందఱిలో ఒక వస్తువునైనను నశింప జేయకుము. రోగమందినవారిగా జేయకుము.

ఋక్కు 2.

యాతే రుద్ర. శివా తనూశ్శివావిశ్వాహ భేషజీ.
శివా ఋద్రస్య భేషజీ తయానో మృడ జీవసే.

ఓ శివుఁడా! నీదగు ఒక శరీరము శాంతమైనది. ఆ శరీరముతో మమ్ములను జీవింప జేయుటకు సుఖింప జేయుము. ఆ శరీరము అన్ని దినములందును రోగ దారిద్ర్యాదులను తొలగించుటకు ఔషధము వంటిది కాన శుభకరమైనది. శివుని యొక్క తాదాత్మ్యము పొందుటకు ఔషధ రూపమైనదియును, జ్ఞాన దానముచే సంసార దుఃఖమును తొలగించును గాన మంగళకరమైనదియును అగుచున్నది.

ఋక్కు 3.
ఇమాగం రుద్రాయ తవసేకపర్దినే క్షయద్వీరాయ

ప్రభరామహేమతిం.

యథానశ్శమసద్ద్విపదే చతుష్పదే విశ్వం పుష్టం

గ్రామే అస్మిన్ న్నాతురం.

ఏ ప్రకారముగా మా యొక్క పుత్ర పౌత్రాది రూప

మనుష్యునకును మహిష్యాది రూప పశువునకును,

సుఖము అగునో, ఇంతే కాదు. ఈ గ్రామము నందలి

ప్రపంచము సుఖ పూర్ణమును, ఉపద్రవ

శూన్యమును అగునో అట్లు మేము రుద్రుని కొఱకు

ఈ పూజ ధ్యానము మున్నగు వానికి చెందిన

బుద్ధిని గొప్పగా పోషించు చున్నాము. బల

యుక్తుఁడును, తాపస వేషుఁడును, క్షీణించు ప్రతిపక్ష

పురుషులు కలవాఁడు నగు రుద్రునకు సకలమును

సమర్పించు చున్నాము.

ఋక్కు 4.

మృడానో రుద్రో తనో మయస్కృధిక్షయ ద్వీరాయ నమసా విధేమతే.

యచ్ఛంచయోశ్చ మనురాయజే పితాతదశ్యామ తవ రుద్ర ప్రణీతౌ.

ఓ శివా! మమ్ములను ఇహ లోకమున సుఖింపఁ జేయుము. ఇంతే కాదు. మాకు పర లోకమునను సుఖమును చేయుము.  నశింప చేయ బడిన మా పాపములును, వీరులును గల నీకు నమస్కారముతో సేవించెదము. పాలకుఁడైన ప్రజాపతి ఏ సుఖమును, దుఃఖమునకు దూరముగా నుండుటను, ఏ లేశమును సంపాదించెనో ఆ సర్వమును మేము ఓ శివుఁడా! నీ యొక్క

ప్రణయమును, స్నేహాతిశయమును కలుగగా పొంద

గలము.

ఋక్కు 5.
మనో మహాంత ముతమానో అర్భకం. మాన ఉక్షంత

ముతమాన ఉక్షితం.
మానోవధీః పితరం  మోత మాతరం ప్రియా మాన స్త

నువో రుద్ర రీరిషః.

ఓ రుద్రుఁడా! మా యొక్క ముదుసలియైన

పురుషుని హింసింపకు. అంతే కాదు. మా యొక్క

బాలుని హింసింపకుము. అంతే కాదు. మాయొక్క

నీరు చిమ్ముటకు సేవ చేయుటకును సమర్థుఁడైన

పురుషుని హింసింపకుము. అంతే కాదు. మా

యొక్క గర్భమందలి పురుషుని హింసింపకుము.

మా యొక్క తండ్రిని చంపకుము. అంతే కాదు.మా తల్లిని కూడా చంపకుము. మా యొక్క ప్రియమైన శరీరములను హింసింపకుము.

ఋక్కు 6.
మానస్తోకేతనయేమాన ఆయుషి మానో గోషు మానో అశ్వేషు రీరిషః.
వీరాన్ మానో రుద్ర భామితో ఽవధీర్హవిష్మంతో నమసా విధేమతే.

రుద్రుఃడా! మా యొక్క సంతానమందును దయ చూపి హింసింపకుము.  మా యొక్క ఆయుర్దాయము విషయమై హింసింపకుము. మాయొక్క గోవులందును, మాయొక్క గుఱ్ఱముల విషయమై హింసను ఆచరింపకుము. కృద్ధుఃడవై

మాయొక్క వీరులను, భృత్యులను వధింపకుము. మేము హవిస్సు గలవారమై నిన్ను నమస్కారముతో సేవించెదము.

ఋక్కు 7.
ఆరాత్తే గోఘ్న ఉత పూరుషఘ్న క్షయద్వీరాయ సుమ్న మస్మేతే అస్తు. రక్షాచనో అధిచ దేవ బ్రూహ్యాధాచనః. శర్మ యచ్ఛద్వి బర్హాః.

గోవులను చంపునట్టియు, అంతే కాదు పుత్ర పౌత్రాది పురుషులను సంహరించు నట్టియు నశింపఁ జేయఁ బడిన సేవకులు గల్గినట్టి నీయొక్క (ఉగ్ర)రూపమున ఉండు గాక. సుఖకరమగు నీయొక్క రూపము మాయందుండుగాక. ఇంతే కాదు. మమ్ములను అన్ని విధముల కాపాడుము.

అంతే కాదు. ఓ ప్రభూ! మమ్ముల‌ను ఇతరుల కంటే అధికులుగ చెప్పుము. ఇంతే కాదు రెండు లోకములను వృద్ధి చేయు నీవు సుఖమునొసంగుము.

ఋక్కు 8.

స్తుతిశ్రుతంగర్త సదం యువానం మృగన్న భీమ ముపహత్నుముగ్రం. మృడాజరిత్రే రుద్రస్తవానో అన్యంతే అస్మన్ నివపంతు సేనాః.

గుహను పోలిన హృదయ పద్మమును సర్వదా ఉండునట్టియును, నిత్యము యువకుఁడైనట్టియును, భయంకరమైన సింహము వలె ప్రళయ కాలమున సర్వ జగత్తును నశింపఁ జేయుటకు భయంకరుఁడైనట్టియు ప్రసిద్ధుఁడైన రుద్రుని ఓ

నాదగు వాకా! స్తోత్రము చేయుము. మా వచనము చే స్తుతింప బడిన వాడపై ప్రతి దినము నశించు మా శరీరమునకు సుఖము చేకూర్చుము. నీ సేవలు అన్యుఁడగు శత్రువును నశింపఁ జేయు గాక.

ఋక్కు 9.
పరిణో రుద్రస్యహేతిర్వృణక్తు పరిత్వేషస్య దుర్మతి రఘాయోః. అవస్థిరామఘువ
ద్భ్యస్తనుష్వమీఢ్వస్తోకాయతనయాయ మృడయ.

శివుని యొక్క ఆయుధము మమ్ములను పూర్తిగా క్రోధముచే ప్రజ్వరిల్లునట్టియు పాప పరిహారక రూపమును గోరు శివుని యొక్క భయంకరమైన బుద్ధి మమ్ములను విడిచి పెట్టును గాక. వారోధ వినాశనకై చెక్కుచెదరక యున్న భయంకర బుద్ధిని

హవిస్సనెడి అన్నముతో గూడిన యజమానుల నుండి తొలగింపుము. భక్తుల కోరికలను అమితముగా నొసంగు రుద్రుఁడా! మా పుత్రులకు మా మనుమలకును సుఖమునొసంగుము.

ఋక్కు 10.
మీఢుష్టమశివతమశివోనస్సుమనాభవ. పరమే వృక్షే అయుధం నిధాయ కృత్తింవసాన ఆచన పినాకం బిభ్రదాగహి.

అతిశయముగా వర్షించి తడుపువాఁడా!(కామముల నొసంగువాఁడా)మిక్కిలి శాంతమైన స్వరూపము కలవాఁడా! మమ్ములను గూర్చి శాంతుఁడవును, మంచి మనస్సుతోడను స్నేహముతోడను గూడినవాఁడవగుము. త్రిశూలాదికమును

అత్యున్నతమైన మట్టి రావి మున్నగు వృక్ష జాతమునందుంచి, వ్యాఘ్ర చర్మమును మాత్రము దాల్చువాఁడవై మా కెదురుగా రమ్ము. పినాకమను ధనుస్సును హస్తమున ధరించుచు రమ్ము.

ఋక్కు 11.
వికిరిదవిలోహిత  నమస్తే అస్తు భగవః. యాస్తే సహస్రగ్ ం  హేతయో ఽన్యమస్మన్నివపంతుతాః.

విశేషముగ భక్తుల సన్నిధిని బహు విధముల ధన రాసులను జిమ్మి ఒసంగువాఁడా! తెల్లనివాఁడా! లేదా, మిక్కిలి ఎఱ్ఱనివాఁడా! ఓ భగవంతుఁడా! నీకు నమస్కారమగు గాక. నీకు ఏ ఆయుధములు వేలకొలది కలవో (వానిని) వాటి చే మాకంతే ఇతరుఁడైన విరోధిని నశింపజేయును గాక.

ఋక్కు 12.
సహస్రాణి సహస్రధా బాహువోస్తవ హేతయః.
తాసామీశానో భగవః పరాచీనాముఖాకృధి.

ఓ శివా నీ యొక్క చేతులందు ఆయుధములు
వేయి విధముల వేలకొలదీ కలవు. ఓ భగవంతుఁడా!
సమర్థుఁడవగుచు, ఆ ఆయుధములకు
ముఖములను, శల్యములను మాకు
పరాఙ్ముఖమగునట్లు చేయుము.
అనువాకము 10 సమాప్తము.

అనువాకము 11.
ఋక్కు 1.

సహస్రాణి సహస్రశో యేరుద్రా  అధిభూమ్యాం

తేష్వాగ్ ంసహస్ర యోజనే ఽవహన్వాని తన్మసి.

భూమి యొక్క ఉపరి భాగమున ఏ రుద్రులు సహస్ర ప్రకారులై సహస్ర సంఖ్యాకులై, కలరో ఆరుద్రులయొక్క ధనుస్సులును, మాకంటే సహస్ర యోజనములు దాటిన పిమ్మట గల దేశమున తొలగింపబడిన వింటి త్రాడు కలవిగా జేసి ఉంచుము.

ఋక్కు 2.

అస్మిన్ మహత్యర్ణవే ఽంతరిక్షేభవా అధి.

ఈ కాన వచ్చు మహా సముద్రముతో సమానమైన అంతరిక్షము నాశ్రయించి యున్న రుద్రమూర్తి

విశేషములు సహస్ర యోజనముల దూరమున ఉండుగాక.

ఋక్కు 3.

నీలగ్రీవాశ్శితి కంఠాః శర్వా అధః క్షమాచరాః.

రుద్రుని యొక్క మూర్తి విశేషములు కొన్ని ప్రదేశములందు నీల వర్ణములును, ఇతర ప్రదేశములందు శ్వేత వర్ణములై యుండును. నీల కంఠములు హింసించు నవియును పాతాళమున సంచరించు నవియును ఐయున్నవి.

ఋక్కు 4.

నీలగ్రీవాశ్శితికంఠా దివగ్ ం రుద్రా ఉపశ్రితాః.

నీల శ్వేత వర్ణములును, నలుపు కంఠమునందు గల రుద్రాంశ గల దేవాదులు  స్వర్గమును ఆశ్రయించి యుండిరి.

ఋక్కు 5.
ఏ వృక్షేషు సస్పింజరా నీల గ్రీవా విలోహితాః.

వృక్షము లందు ఏ రుద్రులు కలరో వారు లేత గడ్డి వలె పింజర వర్ణము కలవారు. నీల వర్ణమైన గ్రీవము కలవారు. కొందరు విశేషముగ రక్త వర్ణము కలవారు.

ఋక్కు 6.
యే భూతానామధిపతియో విశిఖాసః కపర్దినః.

ఏ రుద్రులు కాన రాని శరీరము కలవారై మనుష్యులకు ఉపద్రవములను గావించు భూత గణములకు ప్రభువులో వారిలో కొందరు నున్నగా చేయ బడిన  శిరస్సులు కలవారై జటాజూటము లకలవారై జీవులను హింసిచు చున్నారు. వారు దూరముగా నుందురు గాక.

ఋక్కు 7.
యే అన్నేషు వివిద్యంతి పాత్రేషు పిబతో జనాన్.

ఏ రుద్రులు (రుద్రాంశ గలవి) భుజింప దగిన వస్తువు లందు గూఢముగా నున్నవై జనులను విశేషముగా బాధించు చున్నవో త్రాగ తగిన పాలు మున్నగు వానిలో నున్నవై త్రాగుచున్న జనులను

విశేషముగా బాధించు చున్నవో అవి దూరముగా

నుండును గాక.

ఋక్కు 8.

యే పథాం పథి రక్షయ ఐలబృదా యవ్యుధః.

ఏ రుద్రులు లౌకికములును వైదికములునగు

మార్గములను రక్షించువారో , అన్న సమూహమును

భరించువారో, అన్న ప్రదానముచే జీవులను

పోషించువారో, వారు మిశ్రములై విరోధులతో

యుద్ధము చేయువారు అగుచున్నారు. వారు

దూరముగా ఉందురుగాక.

ఋక్కు 9

యజుస్సు1.
ఏ తీర్థాని ప్రచరంతి సృకావంతోనిషంగిణః.

ఏ రుద్రులు కాశీ ప్రయాగాది క్షేత్రములను రక్షించుటకు సంచరించుచున్నారో వారు ఈటెలు కలవారును, కత్తులు కలవారును అయి యుండిరి.

ఋక్కు 10

యజుస్సు 2.
య ఏతావంతశ్చ భూయాగ్ సశ్చ దిశో రుద్రా వితస్థిరే . తేషాగ్ ం సహస్ర యోజనేవ ధన్వాని తన్మసి.

ఏ రుద్రులు వేలకొలది కలరో అంతకంటె అధికులై

అన్ని దిక్కులను ప్రవేశించి కలరో వారి యొక్క ధనుస్సులను వేయి యోజనముల దూరమున వింటి త్రాడు తొలగించి ఉంచుడు.

ఋుక్కు 11.

యజుస్సు 3.

నమో రుద్రేభ్యోయే పృధివ్యాం ఏ ఉ ంతరిక్షే.

యే దివి యేషామన్నంవాతోవర్షమిషవ.

స్తేభ్యోదశ ప్రాచీర్దశ దక్షిణాదశ ప్రతీచీ

ర్దశోదీచీ ర్దశోర్ధ్వాస్తేనో మృడయంతు తేయం

ద్విష్మోయశ్చనోద్వేష్టి తంవోజంభేదధామి.

ఏ రుద్రులు భూమిపై కలరో,ఏరుద్రులకు ఆహారమే బాణములో, అన్నమే బాణములుగా గల రుద్రులకు నమస్కారము. ఏ రుద్రులు ఆకాశమునందు

గాలరో, ఏ రుద్రులకు వాయువు బాణములో, ఆ రుద్రులకు నమస్కారము. ఏ రుద్రులు స్వర్గమునందు కలరో, ఏ రుద్రులకు వర్షము బాణములో, ఆ రుద్రులకు నమస్కారము. తూర్పు ముఖముగా పది వేళ్ళ చివరలు గల అంజలుల తోడను, దక్షిణ ముఖముగా పది వ్రేళ్ళ చివరలు గల అంజలుల తోడను, పడమట ముఖముగా పది వ్రేళ్ళ చివరలు గల అంజలుల తోడను, ఉత్తర ముఖముగా పది వ్రేళ్ళ చివరలు గల అంజలుల తోడను, ఊర్ధ్వ ముఖముగా పది వ్రేళ్ళ చివరలు గల అంజలుల తోడను, ఆ రుద్రులకు నమస్కారములు. ఆ రుద్రులు మమ్ములను సుఖపఱచుదురు గాక. ఎవనిని ద్వేషింతుమో, ఏ శత్రువు మమ్ములను ద్వేషించునో, ఆ శత్రు ద్వయమును రుద్రులారా! మీయొక్క తెరచి యున్న నోటిలో

ఉంచుచున్నాను.

అనువాకము 11 సమాప్తము

## రుద్ర నమకము - చమకము - భావము మీకు తెలుసా? - 3



ఓం త్ర్యంబకం యజామహే సుగంధిం పుష్టి వర్ధనం

ఉర్వారుకమివ బంధనాన్మృత్యోర్ముక్షీయమామృతాత్

యో రుద్రో అగ్నౌ యో అప్సుయ ఓషధీషు యో

రుద్రో విశ్వా భువనా వివేశ తస్మై రుద్రాయ నమో అస్తు.
కాల స్వరూపుఁడు, అఖండ ఆనంద స్వరూపుఁడు ఐన ఆ పరమాత్మతో యోగము ద్వారా మన దేహము పవిత్రమగును గాక.పండిన దోస పండు తనంతట తానే తొడిమ నుండి వేరు పడినట్లు మనమూ మృత్యువు నుండి వేరు పడి అమృతత్వమును పొందుదుము గాక.
అగ్ని, నీరు మున్నగు వానియందును, ఓషధులు విశ్వమున భువనములందును ఏ రుద్రుఁడు లీనమై యుండెనో అట్టి రుద్రునకు నమస్కారము అగును గాక.

" తముష్టుహి యస్స్విషుసు  ధన్వాయో విశ్వస్య క్షయతి భేషజస్య యక్ష్వా మహే సౌ మనసాయ

రుద్రం న మో భిర్దేవ మసురందువస్వ.

ఉత్తమమైన అస్త్ర శస్త్రములు కలిగి, వైద్యుడై మన రోగాలను నిర్మూలించే,రాక్షసులను సంహరించే రుద్రునికి మన మనస్సులను పవిత్రం చేస్తున్నందుకు నమస్కారములు.

అయంమే హస్తో భగవానయంమే భగవత్తర:

అయంమే విశ్వభేషజోయం శివాభిమ ర్శన:

శివుని తాకి, పూజించే ఈ హస్తము మాకు దేవునితో సమానము. శివుని తాకినఈ హస్తము నా సర్వ రోగములకు దివ్యౌషధము.

యేతే సహస్ర మయుతం పాశా

మృత్యోమర్త్యాయ హంతపే తాన్ యజ్ఞస్య

మాయయా సర్వానవ యజామహే మృత్యవే స్వాహా

మృత్యవే స్వాహా ప్రాణానాం గ్రంధిరసి రుద్రోమా

విశాంతక: తేనాన్నే నాప్యాయస్వ నమో రుద్రాయ విష్ణవే మృత్యుర్మే పాహి మమ సర్వాప మృత్యుర్నస్యతు ఆయుర్వర్ధతాం"

ఓ దేవా! ప్రాణులను చంపుటకు ఉపయోగించే సహస్రమైన నీ పాశములను మాకు దూరముగా యుంచమని మా ప్రార్ధన. దానికోరకై మేము ఈ అగ్నిహోత్రము ద్వారా నీకు ప్రీతిని సమర్పిస్తున్నాము. రుద్రునకు నా నమస్కారములు. మృత్యుదేవత నా వాద్దకు రాకుండు గాక. ప్రాణము,ఇంద్రియముల కలిసే గ్రంధులలో నివసించే ఓ దేవా! నేను సమర్పిస్తున్న ఆహారమును స్వీకరించి నాయందు నివసించుము. మృత్యు దేవతను నా నుండి దూరముగా ఉండు గాక.

ఓం శాంతిశ్శాంతిశ్శాంతిః.

నమకము భావము సమాప్తము.

## శ్రీ రుద్ర చమకము.

### అనువాకము 1.

శ్రుతి:-

వాజశ్చమే ప్రసవశ్చమే ప్రయతిశ్చమే ప్రసితిశ్చమే.

ఓ అగ్నావిష్ణులారా! అన్నమును, అన్న

భోజనమునకు అనుమతియును, శుద్ధియును,

బంధనమును, అనగా అన్న విషయకమైన
ఔత్సుక్యమును నాకు సంపాదించెదరు గాక.

ధీతిశ్చమే  క్రతుశ్చమే స్వరశ్చమే శ్లోకశ్చమే.
అన్న ధారణమును, అన్న హేతువైన యజ్ఞమును,
ఉదాత్తాది మంత్ర స్వరమును, స్తుతిని నా
కొసంగుము.

శ్రావశ్చమే శ్రుతిశ్చమే జ్యోతిశ్చమే సువశ్చమే.
విని, వినిపించెడి శక్తిని, సామర్థ్యమును,
ప్రకాశమును, స్వర్గమును నా కొసగుము.

ప్రాణశ్చమే  ఉపానశ్చమే వ్యానశ్చమే ఉసుశ్చమే
ప్రాణ వాయువును, అపాన వాయువును, వ్యాన

వాయువును, ప్రాణాపానాది వృత్తులు కల వాయువును నాకొసగుము.

చిత్తంచమ అధీతంచమే వాక్చమే మనశ్చమే. మనస్సున జనించిన జ్ఞానమును, మనోజ్ఞానముచే సర్వదా ఇంద్రియములను గోచరించు ద్రవ్యమును, వాక్కును, మనస్సును నా కొసంగుము.

చక్షుశ్చమే శ్రోత్రంచమే దక్షశ్చమే బలంచమ నేత్రమును చెవిని జ్ఞానేంద్రియములకు చెందిన నేర్పును నా కొసంగుము.

ఓజశ్చమే సహశ్చమ ఆయుశ్చమే జరాచమ. బల హేతువగు అష్టమ ధాతువును, శత్రువును పరాభవింప గల శక్తిని, ఆయుర్దాయమును,

ఆయుస్సు తగ్గి చర్మము ముడతలు పడి, జుత్తు పండే స్థితిని నాకు చేకూర్చుము.

ఆత్మాచమే తనూశ్చమే శర్మచమే వర్మచమే.
శాస్త్ర ప్రసిద్ధ పరమాత్మయును, చక్కని సన్నివేశము గల శరీరమును, సుఖమును, శరీరమును రక్షించు కవచాదికమును నాకు అగు గాక.

అంగానిచమే ఉ్స్థానిచమే వరూగ్ ుషిచమే శరీరాణిచమే.
శరీరావయవముల నన్నింటిని, యథా స్థానమున గల యముకలను అంగుళ్యాది పర్వములను, ఇంతకు మున్ను చెప్పని అవయవములను, నాకు చేకూర్చుదురు గాక.
అనువాకము 1 సమాప్తము.

అనువాకము 2.

1) జ్యైష్ఠ్యంచమ ఆధిపత్యంచమే మన్యుశ్చమే భామశ్చమే

అన్నిటి కంటే శ్రేష్ఠముగా నుండుటను, ప్రభువుగా నుండుటను, మనస్సున నుండు క్రోధమును, ఓరిమి లేకుండుట మున్నగు కారణములచే కల్గు బాహ్య క్రోధమును నాకు ఒసంగుము.

2) అమశ్చమే ఉంభశ్చమే జేమాచమే మహిమాచమే.

స్వల్ప ప్రయత్నముతో శత్రువులు ఛేదింప శక్యము కాకుండుటను, శైత్య మాధుర్యము గల జలమును జయింప సామర్థ్యమును, మహత్వమును, జయించి

సంపాదించిన ధనాది సంపదను

నాకు(చేకూర్చుము) .

3) వరిమాచమే ప్రథిమాచమే వర్ష్మాచమే

ద్రాఘుయాచమే.

కోర దగిన పూజ్యత్వమును, గృహ క్షేత్రాది

విస్తారమును,  పుత్ర పౌత్రాదుల శరీరములను, పుత్ర

పౌత్రాదులకు చెందిన దీర్ఘత్వమును, నాకు

ఒసంగుము.

4) వృద్ధంచమే వృద్ధిశ్చమే సత్యంచమే శ్రద్ధాచమే.

ఉత్కృష్టమగు అన్నమును, అధికమగు ధనమును,

విద్యాదులకు చెందిన గుణములచే కలిగిన

గొప్పదనమును, యధార్ధ మాడుటను, పర లోకము

కలదను బుద్ధిని, నాకు ఒసంగుడు.

5) జగచ్చమే ధనంచమే పశశ్చమే త్విషిశ్చమే.
స్థావర జంగమమైన గవాదికమును, సువర్ణాది ధనమును, సర్వము స్వాధీనముననుండుటను, శరీర కాంతిని నాకొసంగుము.

6) క్రీడాచమే మోదశ్చమే జాతంచమే జనిష్యమాణంచమే.
పాచికలాడుట మున్నగు దానిని, క్రీడలచే కలుగు ఆనందమును, కలుగబోవు సంతానమును నాకొసంగుడు.

7) సూక్తంచమే సుకృతంచమే విత్తంచమే వేద్యంచమే.
ఋక్కుల సమూహమును, ఋగాది మంత్రములచే కలిగిన అపూర్వమును, పూర్వ లబ్ధమైన

ధనమును, ఇటుపైన పొంద దగిన ద్రవ్య జాతమును నాకు ఒసంగుము.

8) భూతంచమే భవిష్యంచ మే సుగంచమే సుపథంచమ.
పూర్వ సిద్ధమైన క్షేత్రాదులను, మున్ముందు చక్కగా పొంద దగిన దానిని, చక్కగా వెళ్ళ తగిన తావును, బంధువులు గల గ్రామాంతరాదులను, దొంగలు మున్నగు ఈరి బాధలు లేని మార్గమును, నాకు ఒసంగుడు.

9) ఋద్ధంచమ ఋద్ధిశ్చమే  క్లప్తంచమే క్లప్తిశ్చమే మతిశ్చమే సుమతిశ్చమే.
వేద్ధి చేయఁ బడిన ధనాదికమును గాని, ఆచరించిన కర్మ ఫలమును గాని, అనుష్టించ బోవు యజ్ఞముల

ఫలమును, తమ పనులు చేయుటకు సమర్ధమైన ద్రవ్యమును, స్వకీయమైన సామర్ధ్యమును,  పదార్ధమును మాత్రమే నిశ్చయించుటను దుర్ఘటములైన రాజ కార్యాదులకు చెందిన నిశ్చయమును నాకొసంగుడు.

అనువాకము 2 సమాప్తము.

అనువాకము 3.

1) శంచమే మయశ్చమే ప్రియంచమే ఉనుకామశ్చమే కామశ్చమే.

ఐహిక సుఖమును, పర లోక సుఖమును, ప్రీతి కారణమైన వస్తువును, అనుకూలముగానున్న కారణమున కోరఁబడిన పదార్ధమును నా కొసంగుము.

2) సౌమనసశ్చమే భద్రంచమే శ్రేయశ్చమే

మనస్సునకు స్వాస్త్యమును కూర్చు బంధు

వర్గమును, ఇహ లోకమున రమణీయమైన

కల్యాణమును, పరలోకమును నాకొసంగుడు.

3) వస్యశ్చమే యశశ్చమే భగశ్చమే ద్రవిణంచమే.

నివాస హేతువులగు గృహాదులను, కీర్తిని,

సౌభాగ్యమును, ధనమును నా కొసంగుడు.

4) యంతాచమే  ధర్తాచమే క్షేమశ్చమే ధృతిశ్చమే.

ఆచార్యాదుల వలె నియమకుడనగుటను, పిత్రాదుల

వలె పోషకుఁడ నగు శక్తిని, ధైర్యమొంది

నిశ్చలముగా నుండుటను, నాకొసంగుడు.

5) విశ్వంచమే మహశ్చమే సంవిచ్చమే జ్ఞాత్రంచమే.

సర్వ జనులకు అనుకూలముగ నుండుటను, పూజను, వేద శాస్త్రము లకు చెందిన విజ్ఞానమును, జ్ఞాపకము చేయు సామర్థ్యమును నాకొసంగుడు.

6) సూశ్చమే ప్రసూశ్చమే సీరంచమే లయశ్చమ.
పుత్రాదులను ప్రేరేపించు సామర్థ్యమును, భ్రుత్యాదులను ప్రేరేపించు సామర్థ్యనును, గోలాంగూలాదులతో వ్యవసాయమును సాధించు సంపత్తిని, పైని చెప్పిన పనులు చేయుటకు వీలు కాకుండ చేయు ప్రతి బంధమును నివారించుటను నాకొసగుడు.

7) ఋతంచమేఽమృతంచమేఽయక్ష్మంచమే ఽనామయచ్చ మే.
యజ్ఞాది కర్మను, యజ్ఞాది కర్మ ఫలమును, క్షయ

మున్నగు వ్యాధులు లేకుండుటను, జ్వరము మున్నగు చిన్న వ్యాధులు లేకుండుటను, నాకు ఒసంగుడు.

8) జీవాతుశ్చమే దీర్ఘాయుత్వంచమేఽన మిత్రంచమే ఽభయంచమే.
జీవన కారణమైన వ్యాధి పరిహారకమైన ఔషధమును, అప మృత్యువు లేకుండుటను, శత్రువులు లేకుండుటను, భయము లేకుండుటను నాకు ఒసంగుడు.

9) సుగంచమే శయనంచమే సూషాచమే సుదినంచమే.
శోభనమైన గమనమును, శయ్య, తలగడ మున్నగు సంపదను, స్నానాదులచే ప్రకాశించు ప్రాతః

కాలమును, యజ్ఞ దానాధ్యనాదులతో కూడిన సంపూర్ణ దినమును నాకు ఒసంగుడు.

అనువాకము 3 సమాప్తము.

అనువాకము 4.

1) ఊర్క్చమే సూనృతాచమే, పయశ్చమే రసశ్చమే.

అన్న సామాన్యమును ప్రియ వచనమును, అన్న విశేషములను, వానిలో చేరిన పాలను, అన్న విశేషములందు సారమును నాకు ఒసంగుడు.

2) ఘృతంచమే మధుచమే సగ్ధిశ్చమే సపీతిశ్చమే.

ఆవు నేయియును, పూతేనియును, బంధువులతోడి భోజనమును, సహ పానమును నాకు ఒసంగుడు.

3) కృషిశ్చ మే వృష్టిశ్చ మే జైత్రంచమ ఔద్భిద్యంచమే.

అన్నమునకు హేతువైన వ్యవసాయమును, వర్షమును, జయ స్వభావమును, భూమిని దొలుచుకొని జన్మించు చెట్టులు, పొదలు మున్నగు వానిని నాకు ఒసంగుడు.

4) రయిశ్చమే రాయశ్చమే పుష్టంచమే పుష్టిశ్చ మే.

సువర్ణమును, మణులు ముత్యములు మున్నగు వానిని, పూర్వమే చెప్పఁ బడిన సువర్ణము యొక్క సమృద్ధిని, శరీర పోషణమును నా కొసంగుడు.

5) విభుచమే ప్రభుచమే బహుచమే భూయశ్చమే.

విభువును, ప్రభువును,బహు యను దానిని,
భూయః అను దానిని, నాకు ఒసంగుడు.

6) పూర్ణంచమే పూర్ణ తరంచమేఉక్షితిశ్చమే
కూయవాశ్చమే.
పూర్ణమును, పూర్ణ తరమును, అక్షితిని,
కుత్సితములైన యవలను నాకు ఒశంగుడు.

7) అన్నంచమే ఉక్షుచ్చమే వ్రీహయశ్చమే
యవాశ్చమే.
ఆహారమును, అన్నము చేత ఆకలి బాధను
పోగొట్టుటను, ప్రసిద్ధము లైన యవలు మాషములు,
తిలలు, ముద్గములు మున్నగు ధాన్యములను,
బార్లీలను నాకు ఒసంగుడు.

8) మాషాశ్చమే తిలాశ్చమే  ముద్గాశ్చమే
ఖల్వాశ్చమే.
మినుములను, నూవులను, ముద్గములను, పెసలు
కంటే పెద్దవిగా నుండు ధాన్య విశేషములను నాకు
ఒసంగుడు.

9) గోధూమాశ్చమే మసురాశ్చమే
ప్రియంగవశ్చమేఊణవశ్చమే శ్యామాకాశ్చమే
నీవారాశ్చమే.
గోధుమలను, ముద్గల వలె సూపమునకు పనికి
వచ్చు వానిని, ప్రియంగవములను, సూక్ష్మమైన శాలి
ధాన్యములను, గ్రామము లందలి ధాన్య
విశేషములను, అరణ్యమందలి ధాన్యమును నాకు

ఒసంగుడు.

అనువాకము 4 సమాప్తము.

అనువాకము 5 .

1) అశ్మాచమే మృత్తికాచమే గిరయశ్చమే,

పర్వతాశ్చమే.

రాయియును, మట్టియును, పెద్ద కొండలును,

కొండలును, నాకు అగు గాక.

2) సికతాశ్చమే వనస్పతయశ్చమే హిరణ్యంచమే

ఉ_యశ్చమే.

ఇసుకలను, అశ్వత్థాది వృక్షములను,

బంగారమును, వెండిని నాకు ఒసంగుడు.

3) సీసంచమే త్రపుశ్చమే, శ్యామంచమే లోహంచమే.
సీసమును, తగరమును, నల్లటి ఇనుమును, కాశ్య తామ్రాదులను నాకు ఒసంగుడు.

4) అగ్నిశ్చమ ఆపశ్చమే వీరుధశ్చమ ఓషధయశ్చమే.
అగ్నిని, జలములను,  లతలను, ఓషధులను నాకు ఒసగుదు.

5) కృష్టపచ్యంచమే ఉకృష్ట పచ్యంచమే గ్రామ్యాశ్చమే పశవ అరణ్యాశ్చ యజ్ఞేన కల్పంతాం.
దున్నబడిన భూమిలో పండింప బడిన దానిని, దున్న బడని భూమిలో పండిన దానిని,  గ్రామము లందలి పశువులను అరణ్యమునందలి పశువులను

నాకొసంగుడు.అవి నిమిత్తమైన యజ్ఞముచే సమర్థములు అగు గాక.

6) విత్తంచమే విత్తిశ్చమే, భూతంచమే భూతిశ్చమే. పూర్వులచే లబ్ధమైన ధనమును, తన జన్మలో రాబోవు ధనమును, ఐశ్వర్యముతో గూడిన పుత్రాదికమును, స్వకీయమైన ఐశ్వర్యాదికమును నాకు ఒసంగుడు.

7) వసుచమే  వసతిశ్చమే కర్మచమే శక్తిశ్చమే. నివాస సాధనమైన గవాదికమును, నివాసాధారమైన గృహాదికమును, అగ్నిహోత్రాది కర్మ జాతమును, కర్మాచరణమునకు అనుకూలమైన సామర్థ్యమును నాకు ఒసంగుడు.

8) అర్థశ్చమ ఏమశ్చమ ఇతిశ్చమే గతిశ్చమే.

ప్రయోజన విశేషమును, పొంద దగిన సుఖమును, ఇష్ట వస్తువును పొందుటకుపాయమును, ఇష్ట ప్రాప్తిని నాకు ఒసంగుడు.

అనువాకము 5 సమాప్తము.

అనువాకము 6.

1) అగ్నిశ్చమ ఇంద్రశ్చ మే సోమశ్చమ ఇంద్రశ్చమే సవితాచమ ఇంద్రశ్చమే సరస్వతీచమ ఇంద్రశ్చమే.

నాయొక్క అగ్నియును నాకు ఇంద్రుఁడు. నాయొక్క చంద్రుఁడును నాకు ఇంద్రుఁడు. నా యొక్క నాయొక్క సమస్తమును ప్రేరేపించు సూర్యుఁడును నాకు ఇంద్రుఁడు. నాయొక్క సరస్వతియును నాకు ఇంద్రుఁడు.

2) పూషాచమ ఇంద్రశ్చమే, బృహస్పతిశ్చమ ఇంద్రశ్చమే మిత్రశ్చమ ఇంద్రశ్చమే వరుణశ్చమ ఇంద్రశ్చమే.
నాయొక్క సూర్య్యుడును నాకు ఇంద్రుుడు. నాయొక్క వేద మంత్రార్థమును చెప్పు బృహస్పతియును నాకు ఇంద్రుుడు. నాయొక్క మిత్రః మిత్రుుడగు సూర్య్యుడు నాకు ఇంద్రుుడు. నాయొక్క వరుణ దేవు@డు నాకు ఇంద్రుుడు అగు గాక.

3) త్వష్టాచమ ఇంద్రశ్చమే ధాతాచమ ఇంద్రశ్చమే విష్ణుశ్చమ ఇంద్రశ్చమే ఉశ్వినౌచమ ఇంద్రశ్చమే.
నా యొక్క త్వష్ట ప్రజాపతియును నాకు ఇంద్రుుడు అగు గాక. నా యొక్క బ్రహ్మయు నాకు ఇంద్రుుడగు

గాక. నా యొక్క విష్ణువున్ నాకు ఇంద్రుఁడగు గాక. నాయొక్క అశ్వినీ దేవతలును నాకు ఇంద్రుఁడు అగు గాక.

4) మరుతశ్చమ ఇంద్రశ్చమే విశ్వేచమే దేవా ఇంద్రశ్చమే. పృథివీచమ
ఇంద్రశ్చమే, ఉ ంతరిక్షంచమ ఇంద్రశ్చ మే.
నా యొక్క వాయువు నాకు ఇంద్రుఁడు అగు గాక. నాయొక్క సమస్త విశ్వ దేవతలు నాకు ఇంద్రుఁడు అగు గాక. నా యొక్క భూదేవి నాకు ఇంద్రుఁడు అగు గాక. నాయొక్క ఆకాశము నాకు ఇంద్రుఁడగు గాక.

5) ద్యౌశ్చమ ఇంద్రశ్చమే దిశశ్చమ ఇంద్రశ్చమే మూర్ధాచమ ఇంద్రశ్చమే. ప్రజాపతిశ్చమ

ఇంద్రశ్చమే.

నా యొక్క స్వర్గము నాకు ఇంద్రుడు అగు గాక.
నాయొక్క దిక్కులు నాకు ఇంద్రుడు అగు గాక. నా
యొక్క ఊర్ధ్వ దిక్కును నాకు ఇంద్రుడు అగు గాక.
నాయొక్క విశ్వ కర్మ యను ప్రజా పతియును నాకు
ఇంద్రుడు అగు గాక.

అనువాకము 6 సమాప్తము.

అనువాకము 7.

1) అగ్ ం శుశ్చమే రశ్మిశ్చమే ఉదాభ్యాశ్చమే
ఉధిపతిశ్చమ.

సోమ గ్రహమును నాకు అగు గాక. రశ్మి గ్రహమును
నాకు అగు గాక. అదాభ్య గ్రహమును నాకు అగు
గాక. అధిపతి గ్రహమును నాకు అగు గాక.

2) ఉపాగ్ ◌ంశుశ్చమే ఉ◌ంతర్యామశ్చమ ఐంద్ర వాయవశ్చమే మైత్రావరుణశ్చమ.

ఉపాంశువును నాకు అగు గాక. అంతర్యామమును నాకు అగు గాక. ఇంద్ర వాయువులకు చెందిన ఇంద్ర వాయవమును నాకు అగు గాక. మైత్రావరుణులకు చెందినవియును నాకు అగు గాక.

3) అశ్వినశ్చమే ప్రతిప్రస్థానశ్చమే శుక్రశ్చమే మంథీచమే.

అశ్వినులును నాకు ఒసంగుము. ప్రతి ప్రస్థానమును నాకు అగు గాక. శుక్రమును నాకు ఒసంగుము. మంథీ యనునదియును నాకు ఒసంగుము.

4) ఆగ్రయణశ్చమే వైశ్వదేవశ్చమే ధ్రువశ్చమే.

వైశ్వానరశ్చమే.

ఆగ్రయణమును నాకొసంగుము. వైశ్వ దేవమును నాకు ఒసంగుము. ధృవగ్రహమును నాకొసంగుము. వైశ్వానరమును నాకు ఒసంగుము.

5) ఋతు గ్రహాశ్చమే ఉతి గ్రాహ్యాశ్చమే ఐంద్రాగ్నశ్చమే వైశ్వ దేవశ్చమే.

ఆరు ఋతువులును నాకు ఒసంగ బడును గాక. నవ గ్రహములును నాకొసంగబడుదురు గాక. మిక్కిలి గ్రహింప దగిన ఇతర గ్రహమును నాకొసంగబడుదురు గాక. ఇంద్రాగ్నుల కలయికయును నాకొసంగబడును గాక. వైశ్వ ద్వేవమును నాకొసంగభడును గాక.

6) మరుత్వతీయాశ్చమే మాహేంద్రశ్చమ

ఆదిత్యశ్చమే సావిత్రశ్చమే.
మరుత్వతీయములును నాకు అగు గాక.
మహేంద్రమును నాకు అగును గాక. ఆదిత్యమును
నాకు అగును గాక. సావిత్రమును నాకు అగును
గాక.

7) సారస్వతశ్చమే పౌష్ణశ్చమే పాత్నీవతశ్చమే
హారియోజనశ్చమే.
సారస్వతమును నాకు ఒసంగుఁడు. పౌష్ణమును
నాకు ఒసంగుఁడు. పత్నీవతమును నాకు
ఒసంగుఁడు. హరియోజనమును నాకు ఒసంగుఁడు.
అనువాకము 7 సమాప్తము.

అనువాకము 8.

1) ఇధ్మశ్చమే బర్హిశ్చమే వేదిశ్చమే ధిష్ణియాశ్చమే.
ఇధ్మమును నాకు ఒసంగుము. బర్హిస్సును నాకు ఒసంగుము. వేదిని నాకు ఒసంగుము.
ధిష్టియములను నాకు ఒసంగుము.

2) స్రుచశ్చమే చమసాశ్చమే గ్రావాణశ్చమే స్వరవశ్చమే.
స్రుక్కులను నాకు ఒసంగుడు. చమసలను నాకు ఒసంగుడు. గ్రావాణములను నాకు ఒసంగుడు. ఒక విధమగు యజ్ఞాంగములను నాకు ఒసంగుడు.

3) ఉపరవాశ్చమే ధిషవణేచమే ద్రోణ కలశశ్చమే వాయవ్యానిచమే.
ఉపరవములును నాకు అగు గాక.
అధిషవణములును నాకు అగు గాక. ద్రోణ

కలశమును నాకు అగు గాక.వాయవ్యములును నాకు అగు గాక.

4) పూత భృచ్చమ అధవనీయశ్చమ ఆగ్నీధ్రంచమే హవిర్ధానంచమే.
పూత భృత్తును నాకు ఒసగుఁడు.అధవనీయమును నాకు ఒసగుఁడు. అగ్నీధ్రవమును నాకు ఒసగుఁడు. హవిర్ధానమును నాకు ఒసగుఁడు.

5) గృహాశ్చమే సదశ్చమే పురోడాశాశ్చమే పచతాశ్చమే ఉవభృథశ్చమే స్వగాకారశ్చమే.
పత్నిశాలాదులను నాకు చేకూర్పుఁడు.సదస్సులను నాకు చేకూర్పుఁడు.పురోడాశములను నాకు చేకూర్పుఁడు.
శామిత్రాదులను నాకు

చేకూర్ఛుఁడు.అవభృధమును  నాకు

చేకూర్ఛుఁడు.శంయువాకమును   నాకు

చేకూర్ఛుఁడు.

అనువాకము 8 సమాప్తము.

అనువాకము 9.

1) అగ్నిశ్చమే ఘర్మశ్చమే ఉర్కశ్చమే

సూర్యశ్చమే.

చీయమానమైన అగ్నుయును నాకు అగును గాక.

ప్రవర్గ్యమును నాకు అగును గాక. అర్కయాగమును

సూర్య యాగమును నాకు అగును గాక.

2) ప్రాణశ్చమే ఉశ్వమేధశ్చమే పృథివీచమే

ఉదితిశ్చమే.

ప్రాణాహుతి హోమమును నాకు ఒసంగుము.
అశ్వమేథమును నాకు ఒసంగుము.పృథివిని నాకు ఒసంగుము. అదితిని నాకు ఒసంగుము.

3) దితిశ్చమే ద్యౌశ్చమే శక్వరీ రంగుళమో దిశశ్చమే యజ్ఞేన కల్పంతాం.
దితియును స్వర్గమున్ వృషభ సంబంధమైనవియును  అంగుళి వలె నుండు విరాట్పురుషుని అవయవ విశేషములును దిశలును, విదిశలును అవన్నియును నా యొక్క యజ్ఞముతో స్వస్వవ్యాపార సమర్థములు అగు గాక.

4) ఋక్చమే సాషుచమే స్తోమశ్చమే యజుశ్చమే.
పద్య రూప స్తోత్రములతో నిండిన ఋగ్వేదమును  నాకు ఒసంగుఁడు.గానముతో

మిళితమైన మంత్రములు గల సామ
వేదమును  నాకు ఒసంగుఁడు.సోమావృత్తి రూప
స్తోత్రమును  నాకు ఒసంగుఁడు.వచన రూప
మంత్రమును గల యజుర్వేదమును నాకు
ఒసంగుఁడు.

5) దీక్షాచమే తపశ్చమ ఋతుశ్చమే వ్రతంచమే
హోరాత్రయోర్వృష్ట్యా బృహద్రథంతరేచమే యజ్ఞేన
కల్పేతాం.
దీక్షను నాకు అగు గాక.  తపస్సును నాకు అగు
గాక.  ఋతువును వ్రతమును నాకు అగు
గాక.  రాత్రిందివములు కురియునట్టి వర్షముచే
కలుగు సస్యమును నాకు అగు గాక. బృహత్తు
రథంతరము అను సామములును నాకు అగు గాక.
నా యజ్ఞముచే తమతమ వ్యవహారములందు

సమర్ధములు అగు గాక.

అనువాకము 9 సమాప్తము.

అనువాకము 10.

1) గర్భాశ్చమే వత్సాశ్చమే త్ర్యవిశ్చమే త్ర్యవీచమే.

కడుపులో నున్న ప్రాణులను నాకు ఒసంగుము. వత్సలను నాకు ఒసంగుము.ఒకటిన్నర సంవత్సరముల వయసు మగ గోవులను నాకు ఒసంగుము. అదే వయసు గల ఆడ గోవులను నాకు ఒసంగుము.

2) దిత్యవాట్చమే దిత్యౌహీచమే పంచావిశ్చమే పంచా వీచమే.

రెండు సంవత్సరముల వయసు గల ఋషభమును

నాకు ఒసంగుము. రెండు సంవత్సరముల గోవును నాకు ఒసంగుము. రెండున్నర సంవ్వత్సరముల వయసు కల ఋషభమును నాకు ఒసంగుము. రెండున్నర సంవత్సరముల వయసు కల గోవును నాకు ఒసంగుము.

3) త్రివత్సశ్చమే త్రివత్సాచమే తుర్యవాట్చమే తుర్యౌహీచమే.
మూడు సంవత్సరముల వయసు కల ఋషభమును నాకు ఒసంగుము. మూడు సంవత్సరముల వయసు కల గోవును  నాకు ఒసంగుము.మూడున్నర సంవత్సరముల వయసు కల ఋషభమును నాకు ఒసంగుము. మూడున్నర సంవత్సరముల వయసు కల గోవును నాకు ఒసంగుము.

4) పష్ఠవాచ్చమే పష్ఠౌహీచమే ఉక్షాచమే వశాచమే. నాలుగు సంవత్సరముల వయసు కల ఋషభమును  నాకు ఒసంగుము.నాలుగు సంవత్సరముల వయసు కల గోవును నాకు ఒసంగుము. సేచన క్రియకు సమర్థమైన ఋషభమును నాకు ఒసంగుము. వంధ్య యైన గోవును నాకు ఒసంగుము.

5) మేవేహచ్చమే ఉనడ్వాంచమే ధేనుశ్చమ ఆయుర్యజ్ఞేన కల్పతాం ప్రాణో యజ్ఞేన కల్పతా మపానో యజ్ఞేన కల్పతాం వ్యానో యజ్ఞేన కల్పతాం చక్షుర్యజ్ఞేన కల్పతాగ్ ం.శ్రోత్రం యజ్ఞేన కల్పతాం మనో యజ్ఞేన కల్పతాం వాగ్యజ్ఞేన కల్పతా మాత్మా యజ్ఞేన కల్పతాం యజ్ఞో యజ్ఞేన కల్పతాం.

వేహత్తును నాకు ఒసంగుము. శకట

వాహనమునకు ఉపయోగ పడు ఋషభమును

నాకు ఒసంగుము. ధేనువును నాకుఒసంగుము.

ఆయువును నాకు ఒసంగుడు.ప్రాణ శక్తిని నాకు

ఒసంగుడు. అపానమును నాకు ఒసంగుడు.వ్యాన

శక్తిని నాకు ఒసంగుడు. చక్షు శ్శక్తిని నాకు

ఒసంగుడు. శ్రోత్ర శక్తిని నాకు ఒసంగుడు. మనశక్తిని

నాకు ఒసంగుడు. వాక్శక్తిని నాకు ఒసంగుడు.

అనువాకము 10 సమాప్తము.

అనువాకము11.

1) ఏకాచమే తిస్రశ్చమే పంచచమే సప్తచమే

నవచమ ఏకాదశచమే త్రయోదశచమే పంచదశచమే

సప్తదశచమే నవదశచమ.

ఒకటి సంఖ్యకు ప్రతీకయగు ప్రకృతి నా పట్ల ప్రసన్న

మగును గాక. మూడుకు ప్రతీకయైన ఇచ్ఛా క్రియా జ్ఞాన శక్తులు(సరస్వతి.లక్ష్మి,పార్వతి)నాయందు ప్రసన్నమగును గాక. ఐదుకు ప్రతీకలైన పంచ భూతమును నాయందు ప్రసన్నమగును గాక. జ్ఞానేంద్రియములు, మనస్సు బుద్ధి యను ఏడును నయందు ప్రసన్నమగును గాక. నవ దుర్గలు నాయందు ప్రసన్నమగును గాక. నవద్వారములు కపాల బిలము మరియు నాభి బిలము అను పదకొండును నాయందు ప్రసన్నమగును గాక. పది దిక్కులును త్రిమూర్తులును నాయందు ప్రసన్నమగును గాక. శ్రోత్రాది పదులాలుగు నాడులు, సుషుమ్నాడి నాయందు ప్రసన్నమగును గాక. దశేంద్రియములును వాటికి తోడుగా ఉన్న సప్త ధాతువులును నాయందు ప్రసన్నమగును గాక.

నవదశ ఓషధులును నాయందు ప్రసన్నమగును గాక.

2) ఏకవిగ్ ం శతిశ్చమే త్రయోవిగ్ ం శతిశ్చమే పంచవిగ్ ం శతిశ్చమే సప్తవిగ్ ం శతిశ్చమే నవవిగ్ ం శతిశ్చమ ఏకత్రిగ్ ం శతిశ్చమే త్రయస్త్రిగ్ ం శచ్చమే.
మనో జ్ఞాన కర్మేంద్రియమును (11) పంచ తన్మాత్రలు(5) పంచ భూతములు (5) అను 21 జీవ తత్వములకు చెందిన మర్మములువైద్య శాస్త్ర ప్రసిద్ధమైనవి నాకు అనుకూలముగానుండును గాక. జ్వరము మొదలుగా గల 23 రోగములు నాయందు ప్రసన్నమగును గాక. అప్సరాదులు 25 మందియు నా యందు ప్రసన్నమగుదురు గాక. చిత్రసేనాది 27 మంది గంధర్వులు నాయందు ప్రసన్నమగుదురు

గాక. కృత్యాది విద్యుద్దేవతలు 29 మందీ నాయందు ప్రసన్నమగుదురు గాక. ఊర్ధ్వ లోకములు 7 అధో లోకములు 7వైకుంఠ, రాధా లోక, గోలోక, మణిద్వీప, మహాకాలపుర,శివపుర, గణేశ లోకములను ఉపస్వరగములు అను 7 అయోధ్య, మధుర, మాయ, కాశీ, కాంచీ అవంతిక, ద్వారావతి యను 7 భూస్వర్గములును, కైలాస, మానస, మేరు వను 3 ఈ మొత్తము 31 నాయందు ప్రసన్నమగును గాక. వసువులు 8మంది,రుద్రులు11 మంది, ఆదిత్యులు 12 మంది, అస్వినీ దేవతలు2, (ప్రజాపతి) యను 33 మంది దేవతలు నాయందు ప్రసన్నమగుదురుగాక.

3) చతస్రశ్చమే ఉష్టాచమే ద్వాదశచమే షోడశచమే విగ్ ంశతిశ్చమే చతుర్విగ్ ం

శతిశ్చమే ఉ  ష్టావిగ్ ం శతిశ్చమే ద్వాత్రిగ్ ం
శచ్చమే చతుశ్చత్వారిగ్ ంశచ్చమే ఉష్టాచత్వారిగ్
ం శచ్చమే.
ధర్మార్థకామమోక్ష అను 4 విద్యలు నాయందు
పేసన్నమగును గాక. అష్టవిధ ప్రకృతులు నాయందు
ప్రసన్నమగును గాక. శిక్షాది వేదాంగములు 6 ను,
ధర్మ శాస్త్రాదులు 6ను, ఈ మొత్తము 12 నాయందు
ప్రసన్నమగును గాక.  దూర శ్రవణ దూర దర్శన
విద్య1. జ్ఞానేంద్రియములకు చెందిన సిద్ధి
విద్యలు5.కర్మేంద్రియములకు చెందిన సిద్ధివిద్యలు5.
స్థాపత్య వేద సిద్ది1.ఫర్జన్య సిద్ధి1. జ్యోతిర్విద్య1.
ఆయుర్విద్య1. పరోక్ష బ్రహ్మ విద్య1.
ఈ 16 నాయందు ప్రసన్నమగును గాక.  పంచ
భూతములు సూక్ష్మ రూపముచే5
స్థూలరూపముచే5.  శబ్దస్పర్శాది విషయములు

స్థూలము5 సూక్ష్మము5 ఈ20 నాయందు
ప్రసన్నమగును గాక. పంచ భూతములు,
శబ్దస్పర్శాదులు5 జ్ఞాన కర్మేంద్రియములు10
మనోబుద్ధి చిత్త అహంకారములు4 .ఈ 24
నాయందు ప్రసన్నమగును గాక. ఆవు, మేక
మున్నగు భేదములతో 28 విధములగు సృష్టి
నాయందు ప్రసన్నమగునుగాక. దేవసృష్టివిధములు
8 స్థావర సృష్టి విధములు 6 కౌమార మానస సృష్టి
విధములు 2 జ్ఞాన కర్మేంరియ సృష్టి విధములు 10
అహంకార సృష్టి విధములు 3. సత్వ
రజస్తమోగుణసృష్టి విధములు 3 ఈ 32 నాయందు
ప్రసన్నమగును గాక. 36 అక్షరములు గల బృహతీ
ఛందస్సు నాయందు ప్రసన్నమగును గాక. 40
అక్షరములు గల పంక్తి ఛందము నాయందు
ప్రసన్నమగును గాక. 44అక్షరములు గల త్రిష్టుప్

ఛందము నాయందు ప్రసన్నమగును గాక. 48 అక్షరములు గల జగతీ ఛందము నాయందు ప్రసన్నమగ్ను గాక.

4) వాజశ్చ ప్రసవశ్చాౖపిజశ్చ క్రతుశ్చ సువశ్చ మూర్ధాచ వ్యశ్నియశ్చాంత్యాయనశ్చాంత్యశ్చ భౌవనశ్చభుపనశ్చాధిపతిశ్చ.
అన్నమును, ఉత్పత్తియును, మరల మరల ఉత్పత్తియును, భోగాది విషయకమైన సంకల్పమును, భోగాది సంకల్పము కలుగుటకు కారకు(డైన ఆదిత్యు(డును, ఆకాశమును, విశేషముగనంతటను వ్యాపించు ఆకాశమున సంభవించునదియును, అంతమున జనించునదియును, అంతమందున్నదియును, భువనమున ఉండునదియును, జగదాత్మకమును,

అధిష్ఠించి పాలించు రాజును, నాకు సంభవించును

గాక.

అనువాకము 11సమాప్తము.

చమకము - భావము - సంపూర్ణము.

**సమాప్తం**